# హరిచరణుడు


రచయిత

శ్రీ కృత్తివాసతీర్థులు B. A. B.ED.

'సాహిత్య సుధాకర' — సాహితీ సమితి



ప్రకాశకులు

**కాళహస్తి తమ్మారావు అండ్ సన్సు,**

సంస్కృతాంధ్ర బుక్ డిపో (స్థా. 1882) రాజమండ్రి.

## ఒకటి

జీవితంలో అంధకారకూపం చూచి వెలుతురులోకి వచ్చినా వెలుతురుకూడా చీకటిగా వుండగా, బాధలన్నీ దిగమింగి, పెదవులమీద చిరునవ్వు తెచ్చుకొని, మ్యూజియం పిట్టగోడ మీద హరిచరణుడు కూర్చున్నాడు. మోటార్ల దుమ్ములో సంజమసకలో సాగిపోయే నిరంతర మానవ ప్రవాహ తరంగ సంక్షోభాన్నీ, చదరంగపు పావులవలె కదిలే మానవుల్నీ అతను చూస్తున్నాడు. మాసినగడ్డం అరచేతిలో పెట్టుకొని జేవురించిన కళ్ళతో కొంతసేపు నిదానంగా చూచినాడు. చిరిగి పోయిన చొక్కా జేబులో నలిగిన ఫొటో తీసి ఒకసారి చూసి నిశ్శబ్దంగా కళ్ళు మూసినాడు. రెప్పలు కన్నీటి తుంపురలతో తడిసినవి. అతని బుగ్గలమీద కన్నీరు జాలుగా ప్రవహించింది. ఆ ఫొటోతో ఏదో మాట్లాడబోయినాడు. మాటలు గొంతు లోంచి పెకిలిరాలేదు. చిత్రాన్ని హృదయానికి హత్తుకొన్నాడు. తోవనేపోయే పిల్లలు అతన్ని వెక్కిరిస్తూ వెర్రివాడని అను కొని బెడ్డలు విసిరినారు. బెడ్డలు అతనికి తగలలేదు; గోడ పక్కనే ఉన్న పనస చెట్టుకు తగిలినాయి. చరణుడు అట్టహాసం చేస్తూ "కొట్టండి నన్ను; కొట్టరేం నన్ను? రాళ్ళివ్వనా?" అనే సరికి పిల్లలు కేకలువేస్తూ వెళ్ళిపోయారు. పెద్దమనుషులు

వీధివెంట వెడుతూ "వాడు తుంటరి బికారి" అని చెప్పు కొంటూ సరదా పడుతున్నారు. మరో పెద్దమనిషి "అవును, శరణాలయంలో పిల్లను మోసం చేసి గొడవచేశాడు. పైగా అన్నివిధాలా పాడైపోయాడు" అని వ్యాఖ్యానం చేశాడు.

గోడమీాద కూర్చున్న హరిచరణుడు పెద్దమనుషుల మాటలు విని నొచ్చుకొన్నాడు. ఒక ప్రేరేపణ వెల్లువలాగ వచ్చింది వాళ్ళని దిగమింగేదామని.

చీకటి పడుతున్నది. తిండికి లేకపోయినా ఏ బాధల్లో ఉన్నా సమస్తాన్నీ విస్మరింపచేసి అనంత పథాలకు తీసుకుపోయే మధువు ఆరగించాలని బయలుదేరినాడు. "ఆపద్బాంధవూ! ఈ కష్టాలకు మధుపానం ఒక్కటే విరుగుడుగా దారి చూపించావు. నీ పాద సన్నిధిలో నాకు ఇంకా తావు లేదు. బాధలకు అతీతమైన విస్మృతి శయ్యాంచలంమీాద, నీల గగనంలో సుధా స్వప్న లోకాల్లో లాలించి వేరే లోకం కల్పిస్తావు." అంటూ సంతోషంగా ఏడ్చినాడు.

పానశాలకు వెళ్లేలోగా అతని ప్రియమిత్రుడు విహారి ఎదురై జాలిగా పలకరించాడు. "చరణ్! నీ స్థితి ఏమీా బాగా లేదు. సాయంకాలం నాదగ్గిరికివస్తే ఈ దురలవాటు నీకు తప్పిపోతుంది. భ్రాన్తిగా కనపడడం మానేశావు."

"విహారీ! అలవాటు పరిపాటయి పోయింది. సమస్తాన్నీ మరిచి పోవాలని తాగుతున్నాను. అంతకన్న ప్రియమైన వస్తువు లేదు."

" ఎందుకు పాడై పోవడం ?"

" ఇంకా ఎందుకు జీవించడం " అన్నాడు హరిచరణుడు.

" ఎందుకా నిస్పృహ ?"

" నిస్పృహ లేకుండా హాయిగా వుందామని తాగు తాను. నేను పానశాలలలో ఆనందమూర్తిని, నటరాజును " అని వికటంగా ఉప్పెనలా నవ్వుతూ సమాధాన మిచ్చాడు హరి చరణుడు.

" లోకం నిన్ను చూసి ఎలా వెక్కిరిస్తోందో తెలుసా?" అని విహారి ప్రశ్నించాడు.

వెంటనే తోవలో ధూళితో కలిసిన గడ్డిపోచ చేత్తో పుచ్చుకొని చరణుడు ఊదేస్తూ " ఇంతే లోకం. ఇందాక పిట్ట గోడ మీద కూర్చుని లోకాన్ని చదరంగ ప్పాళీలాగ చూశాను. మనుష్యులంతా పావులు, ఈపావులు వెక్కిరిస్తే మరో పావుకు నష్టమేమిటి ?" కఠినంగా అన్నాడు.

అతను జవాబు చాలా నీరసంగా ఆయాసంగా చెప్పాడు. అందుకు విహారి జాలిపడి " తిండికూడా మానేశావు. ఎలా జీవిస్తావు ?" అని కొంతసేపు ఊరుకుని " డబ్బు కావాలా చరణ్ " అని అడిగాడు.

విహారి ఎంత స్నేహితుడయినా అతను డబ్బిస్తానన్న ప్పుడు హరిచరణుడి రక్తనాళాల్లో పూర్వుల ఘనతా హంకా రాలు మేళవించి పైకి వచ్చాయి. " వద్దు. డబ్బెందుకు ?" హరిచరణుడు అన్నాడు.

" తాగడం డబ్బులేకుండా సాధ్యమా ? "

" సురాభాండేశ్వరి పైసా కూడా పుచ్చుకోని ఉదార స్వభావ " వికటంగా నవ్వుతూ హారి అన్నాడు.

" ఎంత వ్యర్థం చేసుకుంటున్నావోయ్ జీవితాన్ని. కనకపు సింహాసనంమీద శునకాన్ని కూర్చోపెట్టి ఎందుకు బాధపడతావు ? "

మిత్రుని ప్రశ్నకు హారి హృదయం జాలైంది.

" చరణ్ నీ హృదయంలో ఆమెకు ఉన్నతస్థానం ఇచ్చావు. అందుకు ఆమె తగదు. ఎందుకు విచారిస్తావు ? " విహారి జాలిగా అన్నాడు.

" విహారీ ! పందనుకొని దీపంచుట్టూ తిరుగుతున్నాను."

" అవును మిడతలకు కాల్చి వేసేది దీపమని తెలియదు."

" అమాయిక హృదయాలను ఇంత త్వరగా కాల్చి వేస్తుందని కలలోకూడా అనుకోలేదు. " అంటూ హారిచరణుడు కళ్ళుమూసి నిట్టూర్పు విడిచినాడు. కొంతసేపటికి తెప్పరిల్లి ఆయాసపడుతూ " ఇంకా నాకు ఆశ పోలేదు. ఒక్కసారి ప్రేమించాను. హృదయాన్ని తిప్పుకోలేక సగం కాలిన మిడుత ఎగరలేక ఎగిరినట్లు జీవచ్ఛవమై తిరుగుతున్నాను " అన్నాడు. అలా అనేసరికి విహారి మనోనేత్రంలో బీటలయిన బీడులో మోడయిన చెట్టు కనపడింది. అతను హారిచరణుడి స్థితి చూసి జాలి పడినాడు. క్రియా శూన్యమయిన కారుణ్యం అవతలవారి వేదనను ఒక్కొక్కసారి రెచ్చగొడుతుంది.

# రెండు

విహారికీ హరిచరణుడికీ చిరకాలంనుంచీ హృదయ బాంధవ్యం ఉంది. చరణుడి చెల్లెలయిన తారిణీదేవిని విహారికిచ్చి వివాహము చేయాలని ఉభయ కుటుంబాల వారూ ఎప్పుడో అనుకొన్నారు. తీరా గోత్రం శాఖా చూచేసరికి, పెళ్ళికి ఋషులు అడ్డువచ్చారు. హరిచరణ్ తండ్రి దిలీపుడు కలకత్తాలో నార సంచుల వర్తకంచేసి స్థితిపరుడై వెలిగినాడు. విహారి తండ్రి కూడా కలకత్తాలో మందుల వ్యాపారం చేసేవాడు. ఉభయ కుటుంబాలమధ్యా దోస్తీ బాగా ఉండేది. విహారి తల్లి చనిపోయాక, అతను ఏకపుత్రుడు కావడంచేత తండ్రి కుమారుణ్ణి దిలీపుని ఇంట్లో కొంతకాలం ఉంచినాడు. విహారి దిలీపుని కుటుంబములో కలిసిమెలిసి ఉంటూ, తారిణితో ఆటలాడుతూ పెరుగుతూ వచ్చాడు. తారిణీ విహారులు బొమ్మలపెళ్ళిళ్ళు ఎన్నో చేసేవారు. అప్పుడు మాత్రం ఋషులు అడ్డంరాలేదు. తారిణి పసితనపు అమాయికత్వం వల్ల "నేను పెళ్ళాన్నట, విహారి మొగుడు...బువ్వాలాట అనుకొందాం రారా అన్నయ్యా చరణ్" అనేది.

కొంతకాలమయ్యాక విహారి కలకత్తా వదిలి కాశీలో ఉండటం తటస్థించింది. అజ్ఞాతంగా అవ్యక్తంగా అతని హృద

యంలో తారిణి మీద ఏదో అభిమానమూ ప్రేమ ఉండేది. పదేళ్ళయ్యాక కాశీలో ఉండటం మానేసి పత్రకరీత్యా విహారి కలకత్తాలోనే ఉంటున్నాడు. ఒకనాడు అకస్మాత్తుగా విహారీ చరణులు తోవలో కలిశారు. విహారి చరణుణ్ణి గుర్తించలేక పోయాడు. హారిచరణుడి జీవితంలో తుపానులు రేగడంవల్ల అతను పగిలిపోయిన పడవలా ఉన్నాడు. అందువల్ల విహారి గుర్తించలేక పోయాడు. పదేళ్ళపాటు ఉత్తర ప్రత్యుత్తరాలు లేవు. దిలీపుడి కుటుంబ విషయాలు విహారికి తెలియవు. ఎప్పుడయినా అతనికి హారి జ్ఞాపకం రాగా ఫొటోతీసి మిత్రుణ్ణీ తారిణినీ చూచేవాడు. ఈ పదేళ్ళల్లో తారిణిని మతేరియా జబ్బుతో ఉన్న మసిలి వాడికిచ్చి పెళ్ళి చేశారు. తోవలో మిత్రులు ఇద్దరూ కలవడంతో పదేళ్ళ అభారం క్షణంలో పూడిపోయింది. చిన్ననాటి చెలిమి, చేష్టలూ జ్ఞాపకం చేసుకొన్నారు. బాలస్నేహం ఇతర స్నేహాలకన్న గాఢం. తారిణి వల్ల విహారీ చరణుల మైత్రి దృఢమయింది.

పానశాలకు వెడుతున్న హారిచరణుణ్ణి మందలించి లాభంలేక, విహారి, కర్తవ్యం తెలియక ఏదో ఆలోచనలో మునిగినాడు. నరాలపట్టు తప్పి బాధపడుతూ భారంగా అడుగు తీసి అడుగు వేస్తున్నాడు హారిచరణుడు.

"చరణ్, మందూ మాకూ పుచ్చుకోరాదా ?" అని విహారి అడిగినాడు.

చరణుడు పెదవి విరిచి "మందెందుకు ? ఈ శరీరం ఇంకా ఎవరికోసం ? శరీరం నిర్దాక్షిణ్యంగా చూస్తున్నాను చివికి శిథిలమయినా విచారించను" అన్నాడు.

ఆశా నిరాశల సంఘర్షణలో మానవుడి మనసు భయ పడుతూనే ఆశవైపు మొగ్గుతుంది. చరణుణ్ణి వదిలి విహారి ఆలో చిస్తూ నడక సాగిస్తున్నాడు. చరణుడిలో ఎంత నిరాశ కనిపిస్తున్నదో అంతగా జీవించాలనే గాఢ వాంఛ లేకుండా ఉండదు. ఏనాటికయినా ప్రియురాలు ఆదరించి ఆహ్వానిం చదా అని చరణుడు తుది కోరికతో జీవిస్తున్నాడు.

## మహా డు

విహారి హారిచరణుడి ఇంటికి వెళ్ళి తలుపు తట్టినాడు. తారిణి తలుపు తీసింది. ఇంట్లో మసకగా దీపం వెలుగుతున్నది. గోడ మీాద బల్లి పురుగుల్ని వేటాడుతున్నది. అతను తారిణితో ఏదో చెప్పవలెనని చెప్ప లేక పోయాడు.

తారిణి అది కనిపెట్టి "బావా! మా అన్న కనపడ్లేదా ? తిండికయినా ఇంటికి రాడు. ఇంట్లోకి కావలసినవి తీసుకురాడు విచారంగా వుంటాడు" అంది.

బావగారని పిలిపించుకోడం విహారికి ఇష్టం లేదు. తారిణి, మజుందారు భార్య కనక అలా పిలిపించుకోడం కిట్టదు. అతని హృదయాంతరాళంలో కామవాసన వాత్సల్య రూపంగా

ప్రకటిత మవుతూ వచ్చింది. అందుచేత " చెల్లాయీ! అన్న సంగతి ఏం చెప్పను ? ఆ నాటికానాటికి అధోగతి పాలవు తున్నాడు," అన్నాడు ఆర్ద్ర హృదయంతో విహారి.

" బావగారూ! కుటుంబానికి ఒక్కగా నొక్కడు. వాడే ఇలా చేస్తుంటే మేము ఎలా జీవించటం ? మా నాన్నగారు వర్తకంలో దెబ్బతిని అప్పులపాలై మతిపోయి గౌడీయ మఠంలో సాధువుల్లో కలిశారు. అన్నయ్య ఇల్లు సిలవబెట్టడు. పూట గడిచే దారి లేదు." అని జాలిగా అంది.

" తారిణీ! తాగుడు చరణ్ణి పాడుచేస్తున్నది."

" బావగారూ! అన్నింటికీ మా అమ్మ వోర్పుకుని నెత్తీనోరూ కొట్టుకొని నలుగురి నోళ్ళల్లో పడడం ఎందుకని చావలేక బతుకుతున్నది.

తారిణి తల్లి నెత్తిన ముసుగు లాగుకొంటూ వచ్చింది. " వచ్చావా విహారీ! వెయ్యేళ్ళు. నీమాటే అనుకొంటున్నాం నాయనా. నిన్ను చూస్తే ముచ్చట వేస్తుంది. ఒక ఇంటివాడవు అయినావు. మావాడు వారి దారిమళ్ళే ఉపాయం చూడు తండ్రీ". అంది.

" స్నేహానికి తగనిదాన్ని సింహాసన మెక్కించి హరిచరణ్ అమాయకుడై బాధపడుతున్నాడు." అన్నాడు విహారి.

" విహారీ! పోనీ ఏ కులమయితే ఏమిటని ఊరుకున్నాను. శరణాలయం పిల్లను పెళ్ళాడతానని ఇంట్లో తెచ్చి పెట్టుకొంటే,

లోకానికి జంకక ఆ పిల్లను నిజంగా కోడల్లాగ చూసుకొన్నాం. ”

“ అవును. ఇంతలో ఆపిల్ల అవకతవకగా సంచరిస్తుందని ఎలా అనుకొంటామండీ ”

“ పోనీ విహారీ ! హారి మళ్ళీ మరో పిల్లను చేసుకొన్నా బాగుండిపోను. ఇల్లూవొళ్లూ గుల్ల చేసుకొన్నాడు చేతులారా. ఎంత మొత్తుకొన్నా మామాట వాడికి సుతరాం గిట్టలేదు. వొళ్లు తెలియక తప్పతాగి ఏరాత్రో వస్తాడు. ఏమన్నా అంటే కస్సుబుస్సు లాడతాడు. ఇంతకూ వాడికి శరణాలయం పిల్ల మీాద ప్రేమ పోలేదు. ” అంటూ హారి తల్లి కళ్లు తుడుచుకొన్నది. చిమ్నీదీపం మసి పారింది.

తారిణి “ బావగారూ ! మా గృహచ్ఛిద్రాలన్నీ చెప్పి మీా మనసు బాధిస్తున్నాం అండి. ”

విహారి “ లేదు తారిణీ ! అన్నయ్యా చరణ్ ఎలాగయినా దోవలోకి వస్తే పచ్చగా వుంటే చూడాలని వేయి దేవుళ్ళకు మొక్కుతున్నానమ్మా ” అన్నాడు.

తారిణి తల్లి అందుకొంది. “ ఏమోయ్ విహారీ ! మా అమ్మాయిని నీ కివ్వకపోయినా మా కుటుంబం మీాద నీకున్న ఆదరం మరొకరికి లేదు. నాయనా నువ్వే ఎలాగయినా చరణుడికి నచ్చచెప్పు. ”

విహారి తారిణివైపు జాలిగా చూచాడు.

"నాయనా! నీవే మా అల్లుడివైతే మాయిల్లు పచ్చగా ఉండేది. మావాడు నిన్ను చూసి నేర్చుకొనేవాడు." అని తారిణితల్లి కంట నీరు పెట్టింది.

స్నేహ జడితావల్ల అకస్మాత్తుగా విహారి కంఠంలోంచి మాటలు పెకిలిరాలేదు. కొంతసేపటికి తెప్పరిల్లి విహారి ఇంటికి వెళ్ళిపోయాడు.

## నాలుగు

హరిచరణుడు ఈడెన్ తోటలో బెంచీమీద కూర్చుని చాలా రాత్రి గడిపాడు. ఏదో అతని హృదయంలో ప్రపంచంమీద ఉదాసీనత, జడతా బయలు దేరాయి. చరణుడు ఇంటికి పోలేదు. తల్లీ చెల్లెలూ కలకత్తా వదలి ఎక్కడికో వెళ్ళి పోయారని అతను ఎరగడు. రోజు గడిచే విధంలేక కొడుకును నమ్మి కలకత్తాలో బతకలేక తల్లి పల్లెటిదిక్కుకు వెళ్ళి పోయింది. చరణుడు బెంచీమీదనుంచి లేచి ఎక్కడికి పోవడం అని పెద్ద ప్రశ్న వేసుకొన్నాడు. పావశాలలో ఏర్పడిన దోస్తీ జ్ఞాపకం వచ్చింది. విశ్వంభర చౌదరీ మకామునకు బయలు దేరాడు. తోవలో ఒకరిద్దర్ని డీకొన్నాడు. కాలివేళ్ళకు ఎదురు దెబ్బలు తగలడం కూడా హరిచరణ్ ఎరగడు. వాంతివంటి వికారము రాబోయి మనిషిమీద తూలి పడబోయినాడు.

"ఎవడీ తాగుబోతు" అని తిట్లు తిన్నాడు. చివరకు చౌదరీ బసకు హరి చేరుకొన్నాడు.

“ ఎవరోయ్ హరిచరణ్ ! ” అంటూ చౌదరి లేచి మిత్రుణ్ణి ఆహ్వానించాడు. “ అలా వుందేం చరణ్ నీ ముఖం ? తిండి లేదా ? నిద్ర లేదా ? ”

చరణుడు ఏమీ సమాధానం చెప్పలేక పోయాడు.

చౌదరీ అతన్ని తన పక్క మీద కూర్చో పెట్టుకొని శాంతపరిచి “ చరణ్ ! ఏమిటి సంగతులు ? ” అని ప్రశ్నించాడు.

“ ఏం చెప్పను ? మా వాళ్ళు నన్ను వదిలి ఎక్కడికో వెళ్ళిపోయారు. అయినా నాకని విరగడయి పోయింది.”

“ ఎక్కడున్నావు చరణ్ ఇంతసేవు ? ” ఆశ్చర్యంతో చౌదరీ ప్రశ్నించాడు.

“ ఈడెన్ తోటలో ఉన్నాను. ”

“ ఏమిటి విశేషం ? ”

“ ఏముంది ? ఆకలి దహించేస్తుంది. ” అనలేక అన్నాడు చరణ్.

“ చౌదరీ వెంటనే లోపలికివెళ్ళి పాకెట్ తీసి బిస్కత్తులూ, కొట్టి వేడి టీ తీసుకొచ్చాడు. చరణుడు ఆవురావురని ఆత్మారాముణ్ణి సంతృప్తి పరిచాడు. నీరసంమీద తినడంవల్ల ఆయాసంగా వుంది. మాట్లాడలేక పోయినాడు. అతన్ని శ్రమ పెట్టడం ఎందుకని చౌదరీ “ చరణ్ ! హాయిగా నిద్దరో. అన్ని బాధలూ పోతాయి ” అని పక్క వేశాడు. అతను మధ్య రాత్రి వచ్చి చూసినా హరిచరణుడు నిద్దరోతునే ఉన్నాడు.

తెల్లవారింది. పక్షులు కిలకిల ధ్వనులు చేస్తున్నాయి. చరణుడి హృదయంలో కిలకిల ధ్వనులు లేవు.

"చౌదరీ నీవే నాకు ప్రాణం. నన్ను నీ ఆధీనంలో ఉంచుకొంటావా ?"

"వెర్రివాడా ! శాస్త్రో కూస్త్రో చదువుకుని నాలుగు రాళ్లు తీసుకురాగలిగి అలా అంటావేమిటి ? నీ యిష్టం వచ్చి వన్నాళ్ళు నా దగ్గిరే వుండు" అన్నాడు విశ్వంభర చౌదరి.

"అయితే మీ ఇంటికి వెళ్ళక నీవిలా ఒంటరిగా వుంటావేం ?"

"చరణ్ ! మా వాళ్ళకూ నాకూ పొత్తు కుదరక ఇలా ఉంటున్నాను."

"తరుచుగా నువ్వు ఎక్కడికో రాత్రివూట వెడతావేం?"

"స్నేహితులింటికి" అని చౌదరి కొంతసేపు ఊరుకొని ఇలా అన్నాడు "మీ వాళ్ళకూ నీకూ పడకనా ఇలా వచ్చావు? మరేదయినా తగినంత కారణం ?" సగంమాటలో అందుకొని "మరెవరితో లేదు. మరేమీ లేదు" అని హారిచరణుడు సంబాళించుకొంటూ పలికినాడు. అతని కళ్లల్లో కన్నీరు తూగాడింది. పురాతన స్మృతులు ఆ కన్నీటిలో ప్రతిఫలించాయి. చౌదరి అది గ్రహించి అతన్ని అట్టే అడగలేదు.

హారిచరణుడు రెండు మూడు రోజులు పార్కులో నీళ్లూ ఆకాశం చూస్తూ మానవసంఘాన్ని బహిష్కరించాడు. సమాజం తప్పించుకొంటూ ఏదో పరధ్యానంగా ఉంటూ

వచ్చాడు. చరణుడి పరధ్యానం ఉదాసీనతా కనిపెట్టి అతనికి ఉల్లాసం కలిగించాలని చౌదరీ ఆలోచించాడు.

"హరిచరణ్! నేను రాత్రి ఎక్కడికి వెళతానో అడిగావుకదూ?" అని చరణుడి కుతూహలము రెచ్చగొట్టినాడు.

'ఆ, అవును' అన్నాడు చరణుడు.

"నేను మంచిచోటికి వెళ్ళను. అయితే ఖుషీగా మాత్రం ఉంటుంది."

"ఏచోటు అయితే ఏం? నన్నుకూడా నీవెంట తీసుకుపో" అని చరణుడు ప్రాధేయ పడ్డాడు.

"అయితే రాత్రి పెందలాడే తిండి తిని వెడదాము." అన్నాడు చౌదరి.

"సంజవేళ పోస్టువాడు ఉత్తరం తెచ్చి చరణుడికి ఇచ్చాడు. అతని విలాసము ఎవరూ ఎరగరు. ఎలా ఉత్తరం వచ్చిందా అని ఆశ్చర్యపడుతూ కవరువిప్పి దీపందగ్గిర ఈజీ చైరులో పడి వాల్చి చదివాడు. విహారి రాసిన ఉత్తరం అది:—

"ప్రియచరణ్!

నీకోసం కళ్ళు కాయలు కాచేలాగ ఎదురు చూశాను. నీవు ఎక్కడా కనపడవు. గుండె బరువుతో రాస్తున్నాను. తారిణీ మా అమ్మగారూ మా పిన్నిగారింటికి పొరుగూరు వెళ్ళిపోయారు. తిండికి కూడా గడవక నిన్ను నమ్ముకుని కలకత్తాలో కాపరం చెయ్యలేమనీ ఎక్కడవున్నా నీక్షేమం నన్ను తెలుసు

కోమనీ చెప్పి వెళ్ళారు. నీతల్లికి నువ్వు ద్రోహం చేశావు. నీ తండ్రి సాధువుల్లో కలిసి పోయినంత మాత్రాన వంశం ఇలా చితికి పోవడమా? నీ కర్తవ్యం మరిచిపోతున్నావు. అన్నట్టు మరిచిపోయాను రాయడం. గాయాన్ని రేపుతున్నాను; కారం చల్లుతున్నానేమో ఈ కబురువల్ల.

నీ ప్రేయసి—అలా అంటే కోపం రాదుగద అవును, ఒకప్పుడు పూర్వాశ్రమంలో నీ ప్రేయసి గదా—ఆ అరుణతార సన్యాలు పెట్టిన ఐస్ పార్లోర్‌లో నౌఖరీకి కుదిరింది. సన్యాలు సామాన్యుడు కాడనీ, ఆమె రూపానికి మురిసి ఉద్యోగం ఇచ్చాడనీ వదంతి బయలు దేరింది. కనకపు సింహాసనమున హృదయ సామ్రాజ్య పట్టాభిషేకం చేశావు. ఆ అరుణతార రంగులు ఫిరాయిస్తూ ఉంది. ఇలా రాశానని కోపగించకు.

—సదా నీ క్షేమం కోరే ప్రియమిత్రుడు, విహారి.”

ఉత్తరం చదివి కన్నీళ్ళతో తడిసిన కవరు ఒకమూల పడేశాడు చరణుడు.

చౌదరీ ఉదయాన్నే కాఫీ తెప్పించాడు. చరణుడికి కాఫీ తాగడానికి మనసు పోలేదు. అతని వాలకం కనిపెట్టి, చౌదరి “ఏమోయ్? నీకీ బాధలు నిషాతోగాని పోవు” అన్నాడు.

“కాదు విశ్వంభరా? స్నేహితుడు రాసిన ఉత్తరం నమ్మి జీవితాన్ని ఒకరికోసం పాడుచేసుకొన్నాను.”

“ఎవరా స్నేహితుడు?” అని ఉత్సాహం కనబరిచాడు చౌదరి.

"ఏం చెప్పను? అబ్బా! స్నేహితురాలే నాకొంప తవ్వేసింది" అని దీర్ఘంగా హరిచరణుడు నిట్టూర్చినాడు.

"అన్నీ మరిచిపోవాలి. భోగట్టాచేసి కష్టపెట్టనుగాని రాత్రి ఖుషీగా అలావెళ్ళి వచ్చేదాం" అన్నాడు విశ్వంభర చౌదరి.

## ఆ యా దు

రాత్రి హరిచరణుడూ విశ్వంభరుడూ బండి మాట్లాడుకొని చిత్పూరు రస్తాలో ఒకపెద్ద మేడదగ్గిరకు వెళ్ళినారు. చౌదరి హరిచరణుడి చెయ్యి పట్టుకొని మేడలో ప్రవేశించాడు.

భద్రకాళి విలాసంగా ఇద్దర్నీ లోపలికి ఆహ్వానించింది.

హరిచరణుడు కాళిని చూచి అసహ్యపడ్డాడు. అతను ఎప్పుడూ స్త్రీని కన్నెత్తి చూడలేదు. శరీరం కంపమెత్తింది. మిత్రుణ్ణి తీవ్రంగా చూచి కళ్ళు చిట్లిస్తూ "నన్నీ అంధకారం లోకి ఎందుకు ఈడ్చావోయ్" అని అన్నాడు బాధగా చరణ్.

భద్రకాళి చరణుని వింత వైఖరి చూచి తెల్లబోయింది. చౌదరి కొయ్యలాగ నిలవబడ్డాడు. కొంత నిమిషం చిక్కిన తరువాత "హరిచరణ్, రావోయ్ లోపలికి పోదాం" అంటూ హెచ్చరిక చేశాడు చౌదరి.

తన మనసు మిత్రుడికి అమాయికంగా అప్పగించి, యంత్రంలాగ కదిలి గదిలోకి వెళ్ళాడు చరణుడు. పందిరి మంచంమీద మల్లెపువ్వులాటి దుప్పటి ముడతలు లేకుండా

పరిచిఉంది. మంచంమీద కూర్చోడానికి జంకు పుట్టింది. అతని బుజం తట్టుతూ 'ఫరవాలేదు కూర్చో' అంటూ విశ్వంభర [illegible] మంచం చివర కూర్చున్నాడు హారి. విశ్వంభరుడు గోడకానుకుని ప్రక్కమీద కూర్చున్నాడు. భద్రకాళి హుక్కాగొట్టం తెచ్చింది. హారిచరణుడికి ఏమీ పాలుపోలేదు. ఏదో పారేసుకొన్న వాడివలె అతను ఖంగారు పడి కాళిని చూచి విసుక్కున్నాడు. భద్రకాళి గుండెలు కలుక్కు మన్నవి. క్షణంసేపు ఆమెకుమతి పోయింది. విశ్వంభ రుడు చేసే హుక్కా గుడగుడ శబ్దంవిని, ఆమె హారిచరణుని ముఖంచూస్తూ మంచం పక్కనే నిలువబడింది. ఏదో అవసరం కన్నట్టు హుక్కు గొట్టం కిందపెట్టి విశ్వంభరుడు లోపలికి వెళ్ళాడు. మంచంమీద ఇద్దరే ఉన్నారు.

"పైసా పుచ్చుకొంటావా ?" అన్న చరణ్ మాటలు కూజాలోంచి మొదటిసారి ఒలికిన నీళ్ళల్లాగ వచ్చాయి. అతని మాటలకు కాళి లోలోపల నవ్వుకుంది. ఈ ఏడెనిమి దేళ్ళ వృత్తిలో ఇంతవింత మనిషీ, అమాయకుడూ ఆమెకు తటస్థ పడలేదు. ఈరాత్రి విశ్వంభరుడి ధర్మాన హారిచరణుడు ఆమెపాల పడినాడు.

పైట సర్దుకొంటూ చిరునవ్వుతో "మీరు రావడం మాఇల్లు పావనంకావడం... ..." అని భద్రకాళి అంటూ వుంటే అర్థోక్తిలో హారిచరణుడు అడ్డువచ్చి "పావనంమాట అలా వుంచు డబ్బు తీసుకోరా ? ఆదుర్దాగా అన్నాడు.

"డబ్బు తీసుకోకపోతే మాకెలా గడవడం" అని ఆమె నవ్వుతూ అతని అమాయికత్వం గ్రహించి జవాబిచ్చింది.

భద్రకాళి మాటలు అతను వినడానికి ఇష్టపడక జేబు తడుము కొన్నాడు. జేబు రూపాయలతో గలగల లాడింది. అతని కాశ్చర్యం వేసింది తనకా రూపాయలు ఎలా వచ్చాయని. చౌదరి జేబులో పడేసి ఉంటాడని ఊహించినాడు. హరిచరణుడు గుప్పెడు రూపాయలు తీసి కాళి చేతుల్లో పోసి వెళ్ళిపోవాలని ప్రయత్నించాడు. చేతిలో ఎన్నిరూపాయలు ఉన్నదో చూచుకోలేదు. అతను వెళ్ళిపోబోతు వుంటే భద్రకాళి వింతగా నవ్వుతూ "ఏమండీ వెళ్ళిపోతారేం?" అని వినయంగా ప్రశ్నించింది. అతనేమీ మారు మాటాడక బెల్లం కొట్టిన రాయిలాగ నిలవ బడ్డాడు. కాళి అతన్ని చూచి జాలిపడి ఎందుకోగాని సొమ్ము తిరిగి ఇచ్చివేదామనూ కొంది. అలా తిరిగి ఇచ్చేస్తే ఏమనుకొంటాడోనని వెనక్కు తీసింది. అయినా వచ్చేపోయే రసికుల్ని రంజింపచెయ్యడం నేర్చుకుంది కనక ఒక్కొక్కప్పుడు తిట్లూ దీవెనలూ ఆమె సమంగా ఎంచుకోవాలి. అతను గుమ్మందాటి వెళ్ళిపోతూ వుంటే కాళి అతని పాదాలకేసి అరమోడ్పు కళ్ళతో చూచింది. అదివరకు ఎందరో ఆమె హావ భావ విలాసాలకు లోనయినారు. అయితే ఎందుకో అస్పష్టంగా ఆమె హృదయంలో హరిచరణుడిమీద మమకారం బయలు దేరింది. బహుశా చరణుడి అమాయికత్వం ఆమె హృదయాన్ని మార

గొన్నదో ఏమో! రసికులు అంత అమాయిక కోమలంగా ఉంటారా అని అనుకోవచ్చు. అతన్ని చూచి బతికి చెడ్డవాడని కాళి జాలిపడిందేమో. చరణుడు మాత్రం కాళిలో బయలు దేరిన వింత పరివర్తనం అర్థం చేసుకొనే స్థితిలో లేడు. విసవిస అతను గుమ్మం దాటుతూ వుంటే చూచి విశ్వంభరుడు అడ్డం వచ్చి "ఎక్కడికోయ్ అలా వెళ్ళిపోతున్నావు?" అని అడిగి నాడు. రెండు మెట్లు దిగినాడు చరణుడు.

విశ్వంభరుడు "నేనూరానా?" అని సవినయంగా అడిగినాడు.

"నన్ను వెళ్ళనీ – తర్వాత నీవు రావచ్చును" అంటూ త్వరగా చరణుడు వెళ్ళిపోయాడు.

విశ్వంభరుడు పైకి వచ్చాడు. మేడమీదినుంచి భద్ర కాళి హరిచరణుణ్ణి చూస్తున్నది. ఆమె చేతి రుమాలులో కట్టుకొన్న రూపాయలు అతని చేతిలో పెట్టి "ఇది పాపిష్ఠి సొమ్ము. తీసుకోను. వెంటనే వెళ్ళి అతనికి ఇచ్చెయ్యి" అంది.

"ఏం అలా అంటావు?"

"అతనికి మతి స్తిమితంగా లేదా?" అని అడిగింది కాళి.

"లేదు"

"ఎందుచేతనో తెలుసునా?" అని కుతూహలం కన బరిచింది.

"ఇంట్లో బాధలవల్ల అలా అయిపోయాడు" జాలిగా అన్నాడు విశ్వంభరుడు.

" అయితే ఎందుకతన్ని తీసుకురావడం ? "

" అతనే వచ్చాడు కూడా "

భద్రకాళి కొంతసేపు ఆలోచించింది . " విశ్వంభరా ! నాకు సాయంచేసిపెట్టాలి. "

" ఏమిటి చెప్పు. "

" చెప్పడంకాదు. వెంటనే చెయ్యాలి. అతని మకాం ఎక్కడేమిటి ? "

" ఈడెన్ తోట్లో నాబస దగ్గిరే ఉంటాడు. "

" అతన్ని తీసుకురా విశ్వంభరా" ఆదుర్దాగా అడిగింది.

" అతను రాడు. ఇలాంటి చోట్లకు రాలేడు. "

" అలాకాదు విశ్వంభర్ ఏదో నెపంమీద తీసుకురా "

విశ్వంభరుడు నవ్వుతూ " అకస్మాత్తుగా వైరివాడిమీద ప్రేమ దొర్లుతున్నదా ? " అని అడిగాడు.

" నన్ను ఎగాదిగా చూడక ఊరికే సొమ్మిచ్చి వెళ్ళి పోయాడతను. నాకు అతనంటే ఇష్టం కలిగింది, " అంది కాళి.

" అలాగే అతన్ని తీసుకొస్తాను. సరిగదా " అన్నాడు విశ్వంభరుడు.

## ఆరు

యథాప్రకారంగా చరణుడు ఈడెన్ తోటకు వెళ్ళాడు. విశ్వంభరుడు రాకపోవడంవల్ల అతను తోటలో సిమెంటు బెంచిమీద కూర్చుని తారులాగఉన్న అంధకార ప్రపంచంలో

మినుకు మినుకుమని మెరిసే నక్షత్రాలు చూస్తూ కాలం గడిపాడు.

సన్యాలు దగ్గిర అరుణతార నౌకరీలో ఉందని తెలిసి నప్పటి నుంచీ అతని మనసు కుంగిపోయింది. అతను ఈర్ష్యా ద్వేషాలు ఎంత దూరం చేదామన్నా సాధ్యం కాలేదు. అరుణ తార తన జీవన పథాన్ని చూపే ధృవతార అనుకొన్నాడు. గాఢంగా ప్రేమించాడు. ఆమెతో ఎన్ని అనుభూతులు! నిశ్శబ్ద రాత్రివేళ స్మృతి తూలిక పూర్వానుభవాలను మనసు మీద చిత్రిస్తుంది. ఎంత విస్మరించాలని యత్నించినా లాభం లేక పోతున్నది. స్త్రీ హృదయం తెలిసీ తెలియక బోల్తా పడ్డాడు. పులితో చెలగాటం కాదా స్త్రీ సంబంధం! ఎన్ని నిఖ రంగారు బంగారు స్వప్న లోకాలు సృజించుకొన్నాడు! ఆమెతోనే తనజీవిత సర్వస్వం ఉందని ఎంచుకొని ఆమెను అందలమెక్కించాడు.

ప్రశాంతంగా ఉన్న ఆరాత్రి చుక్కల్నిచూస్తూ అరు ణతారను మరిచిపోవడం ఎలాగ? ఒకరాత్రి మాగవెన్నెల కాస్తూ ఉండగా తాను శరణాలయం తోటలో ప్రవేశించడం, తన ప్రియురాలు గవాక్షము దగ్గిర ఎదురు చూస్తూ ఉంటుం దని అనుకోడం, అన్ని జ్ఞాపకం వచ్చాయి. ఎవరయినా చూసినా లక్ష్యంచెయ్యక, సాహసంగా అతను మందిరం తోటలో వెర్రిగాతిరిగాడు. చలికి దుప్పటి ముసుగు పెట్టుకొని కిటికీకింద అరుణతార కోసం రెండుగంటలు పడిగాపులు

పడడం, ఆమె కోమలహస్తం కిటికీ చువ్వల్లోకి పోనిచ్చి సైగ చేయడం తరవాత ఇద్దరూ తోటలో నరమామిడి చెట్టుకాడ వెన్నెల నీడల్లో సమావేశమయిన క్షణాలు స్మృతికి వచ్చాయి. చరణుడి శరీరం పులకరించింది. అరుణతార అతని శరీరంమీద కోమలహస్తం ఉంచేసరికి అతని నోటమాట వెలువడలేదు.

"ఎలా వచ్చావు చరణ్ ! భయం వెయ్యలేదా ! ఒక్కడివీ ఎలావచ్చావు !" అంది అరుణతార.

"నీ కోసం వచ్చేప్పుడు భయాలు అడ్డం వస్తాయా !" అని అతని సమాధానం.

"నీ హృదయంలో నాకు చోటిస్తావా ?" అని ఆమె ప్రశ్న.

"నా హృదయం యావత్తూ నీదే" అని అతని జవాబు.

చరణుడు అనుకొన్నాడు. తన గుండెల్లో ప్రియురాలు చోటు అడిగి చివరకు ఇలా ద్రోహం చేస్తుందా ! అరుణతారే ప్రపంచంగా సర్వస్వంగా తలచిన తనను ఇప్పుడు ఎలా వదిలిస్తున్నదని ? పూర్వప్రేమ యావత్తూ మరిచిపోయి, పరాయి దానిలాగ చపలచిత్తంతో ఐస్ పార్లోరులో నవ్వాలు దగ్గిర నౌఖరీకి అంగీకరించిందా ? రూపం ఎక్కడవుంటే అక్కడ నవ్వాలు కదిపి చూస్తాడు. ఆ దుర్మార్గుడు తారకు శరణ్యమా ? నా హృదయంతో ఇలా ఆటలాడుతుందా ?

ఒక ఉద్రేకం వెల్లువలా వచ్చి అతన్ని క్షోభపెట్టింది. ఈడెన్ తోటలో ఎలక్ట్రిక్ స్తంభం దగ్గిర కూర్చుని హరిచరణుడు ప్రియురాలికి ఉత్తరం రాశాడు. ఆమె మీాది కసిపట్టలేక

తన గుండెలు చీల్చి రక్తంతో సంతకం పెడదామన్న ఈర్ష్యాగ్ని ప్రజ్వరిల్లింది. మరుక్షణంలో ఈర్ష్యా తీవ్రత తగ్గింది. అప్పుడు అనుకొన్నాడు చరణుడు. "నేను ఆమెను పెళ్ళాడలేదు. ఎందుకు నేను ద్వేషభావం చూపడం? ఆమె నా హక్కు అయిపోయినట్టు ఎందుకిలా అనుకోడం?" కొంత సేపటికి తిరిగి ఈర్ష్య త్రాచుపాము పడగవలె తలె త్తింది. ఉండబట్టలేక రాసిన ఉత్తరం పళ్ళు కొరుకుతూ చదువుకొన్నాడు. :—

"ఈడెన్ గార్డెన్, రాత్రి, బెంచిమీద"

"మంజుభాషిణీ!

శుభాశీస్సులు. ఇలా నిన్ను సంబోధించడం ఉచితమే అనుకోవా? ఎన్ని మాటలు—ఎంత తీయని వాగ్దానాలు—శపథాలు చెప్పి నన్ను ఊరించి రెచ్చగొట్టి ఉన్మత్తుణ్ణి చేసి, అనంతపథాల్లో అనేక అనుభవాల్లో లాలించి, కొండశిఖరాన కూర్చోపెట్టి, ఇప్పుడే వస్తానుండు అంటూ వెళ్ళిపోయి ఇంత దగా చేస్తావా? దగా అనను. ఆడిస్తావా? ఆకాశానికి రంగులు ఫిరాయించే స్వభావం సహజంగా ఉంది. ఇలా రంగులు ఫిరాయించి స్థిరత్వం లేని కపటప్రేమ నాటకానికి నాందీ ప్రస్తావన సాగించి ఆఖరికి భరతవాక్యంలో నన్నీ గతిలో పడేస్తావా?

అవును. మీ జాతి స్వభావమే అంత! పోనీ, అలా అనుకొందామంటే ఘరానా వంశంలో పుట్టిన దానివి! నా హృదయాన్ని ముక్కా చెక్కా చేసి వింతగా నవ్వుతూ నా మిత్రులతో ఇచ్ఛకాలు మాట్లాడతావా? విహారిని నీ దగ్గిరికి పంపితే అతనికి ఒక ఉత్తరం ముక్కయినా రాసిచ్చి పంపావు

కాదు. నీలో ఎందుకు ఇంతమార్పు వచ్చిందో ఊహించుకో లేక తికమక పడుతున్నాను. ఉత్తరానికి సమాధానమయినా ఇస్వావా ?

చదువుకొన్నదానివి—శాస్త్రీ కూస్త్రీ ప్రపంచజ్ఞానం సంపాయించిన దానివి—నమ్మించి ద్రోహం చెయ్యడం ధర్మంగా నీకు తోచిందా ? నీ చదువు ఇందుకే వినియోగించినందుకు చదువుకొన్న ఆడాళ్ళ మీద నాకు కసిగా ఉంది. నేను హతిపోయి రెక్కలు కాలిన మిడతలాగ జీవచ్ఛవంలా—కీనీడలా తిరుగుతున్నాను. ఉండనా ?

నీ హారిచరణ్—"

చరణుడు ఉత్తరం చదువుకొని అస్రుధారలు కురిపించాడు. తెల్లవారుతున్నది. ఉత్తరం పోస్టులో వేదామని పోస్టు ఆఫీసుకు మరలినాడు. జేబులోనించి ఉత్తరం తీసి వేస్తున్నప్పుడు చిన్న ఫోటోకూడా ఇవతలకు వచ్చింది. ఫోటోలో అరుణతార రేకెత్తిన లజ్జాభారంతో అర్ధ మందహాసంతో, నమ్రవదనంతో కొత్త పెళ్ళికూతురిలాగ ఉంది. ఆ మందహాసంలో చరణుడు కుటిలతను చూచాడు. ఇప్పుడామె లజ్జావనితగా అతనికి తోచలేదు. హృదయోద్రేకం వెల్లువలైంది. ఫోటో చింపి ముక్కలుచేసి పారేశాడు. అసలురాసిన ఉత్తరం చింపివేసి తెగతెంపులు చేసుకుందామనుకొన్నాడు. తీరా ఉత్తరం పోస్టుచేశాడు.

నడుస్తున్నాడే కాని నడక తపదని అతనికి తెలియదు. పాదాలకు ఎక్కువ వివేకం ఉందేమో గాని అతని మనసుకు

మాత్రంలేదు. మనసు ఈర్ష్యా ప్రకోపంవల్ల తపించింది. విశ్వంభరుడున్న చోటికి వెళ్ళవలసినా గమ్యస్థానంకూడా గమనించక హారిచరణుడు పాదాలు ఎటునడిస్తే అటు సాగిపోతున్నాడు. గుండెల్లో తాటాకులు మంట రగులుతున్నట్టు బాధపడుతున్నాడు. కొంతసేపటికి తన అహంకారం పూర్వుల ఘనతా హృదయంలోంచి పైకి వచ్చేసరికి, "ఛీ సామాన్య స్త్రీకోసం జీవితం ఇలా వ్యర్థం చేసుకోడం భావ్యమా ?" అని అనుకున్నాడు హారిచరణుడు. కాని ఆ భావం అట్టేసేపు స్థిరంగా లేదు.

తోవలో సైకిలుమీద పోతూ. సన్యాలు ఎదురుపడ్డాడు అతను సైకిలు ఆపేసి హారిచరణుణ్ణి వింతగా పలకరించాడు. ముళ్ళమీద నిలవబడినట్టు చరణుడు ఎలాగో నిలవబడ్డాడు. "హారిబాబా ! కులాసాగా ఉన్నారా ?" అన్న సన్యాలు కొంటె ప్రశ్నకు వ్యంగ్యధోరణిలో చరణ్ జవాబిచ్చాడు.

"హ్వా, ఇంతకన్న కులాసా ఏమిటి ?" అన్నాడు చరణుడు. అని వెంటనే అతను గిరుక్కున తిరిగినాడు.

"సన్యాలు అతని ధోరణి కనిపెట్టి రేగిన గాయంమీద కారం చల్లాలని "హారిబాబూ ! అన్నట్టు మీా రెరగరా ? మీా స్నేహితురాలు మా పార్లోరులో పని చేస్తున్నది" అన్నాడు.

అందుకు హారిచరణుడికి కోపం వచ్చింది. ఎలాగో నిగ్రహించి పెదవులు బిగపట్టి పల్లెత్తు మాటకూడా జవాబివ్వలేదు.

"అప్పుడప్పుడూ మీా సంగతే చెబుతూ వుంటుంది తార. మీారు చాలా మంచివారనీ..."

సన్యాలు ధోరణికి హరిచరణుడు అడ్డువచ్చి "నాకు తొందరపని ...... వెళ్ళిపోవాలి..." అంటూ చటుక్కున మరలినాడు. సన్యాలు క్షణం ఊరుకుని సాగిపోయినాడు.

## రెండు

హరిచరణుడు కాళ్ళీడ్చుకొంటూ విశ్వంభర చౌదరీ నివాసము చేరాడు. ఉదయము తొమ్మిది గంటలయినా విశ్వంభరుడు పక్కమీదినుంచి లేవలేదు. రాత్రల్లా చిత్పూరు రోడ్డులో భద్రకాళితో జాగరణం చేయడంవల్ల అతనికి చప్పున కళ్ళు విడివడలేదు. పడుకున్నవాణ్ణి లేపడము ఎందుకని చరణుడు ఈజీ చైరులో పడివాల్చి మగతగా ఉన్నాడు. అతనికీ రాత్రల్లా వేదనవల్ల నిద్ర లేకపోయింది. విశ్వంభరుడు పదింటికి లేచి కళ్ళు నలుపుకొంటూ మిత్రుణ్ణి చూచి "అరె! ఎప్పుడొచ్చాడు? ఏమిటిలానిద్ర?" అనుకొని, తాగి పరున్నాడేమో నని అనుమానించి దగ్గిరికి వచ్చి వాసనచూస్తే, చరణుడు తాగి రాలేదని తెలుసుకొన్నాడు. అతన్ని లేపి "చరణ్! ఏమిటి రాత్రి అలా వెళ్ళిపోయావు?" అని ప్రశ్నించాడు.

"నేను అలాంటి చోట్లకు రాను" అని భీష్మించాడు చరణుడు.

"విలాసంగా వెడితే తప్పా? కాళి ఎంత మంచిదను కొన్నావు?"

"ఏమిటా మంచితనం?" అని చరణుడు ఆశ్చర్యంగా అడిగినాడు.

"మంచితనం కాక మరేమిటి? నువ్విచ్చిన రూపా యలు నీకు తిరిగిఇచ్చివేయమన్నది. నన్ను చెడ్డ బలవంతం చేసి రూపాయలు నీకివ్వమని నాచేతికిచ్చి వేసింది"

"నాకెందుకు? ఆ సొమ్ము నువ్వే నాజేబులో వేసి ఉంటావు?"

"ఫరవాలేదు గాని ... చరణ్, నిన్నొకసారి ఎలా గయినా తన దగ్గిరికి తీసుకురమ్మని భద్రకాళి పదేపదే చెప్పింది."

హారిచరణుడు ఆశ్చర్యపడ్డాడు. "నన్నా ... ... నన్ను!"

"ఎందుకలా ఆశ్చర్య పడతావు చరణ్, నీమీద కాళికి ఇష్టంగావుంది."

"వేశ్యకు మనమీద మమకారమా? ఏమిటిది!"

"అలాకాదు చరణ్ రేపు రాత్రి తప్పకుండా వెడ దాము."

"రాను విశ్వంభరా!"

"అలాకాదు చరణ్, చాలా గట్టిగా చెప్పింది. బల వంతాన్నైనా నిన్ను లాక్కుని రమ్మంది."

చరణుడు క్షీణంగా నవ్వి "సరే వెడదాం" అని అంగీకారం తెలియచేశాడు.

రాత్రి రిక్షాల్లో ఇద్దరూ చిత్పూరు రోడ్డుమీది విలా సినీ భవనంముందు దిగారు. భద్రకాళి నవ్వుతూ చేతిరుమాలు

విసిరింది. చిరునవ్వుతో కంకణాలు మోగగా కరములెత్తి నమస్కరించి ఇద్దర్నీ లోపలికి ఆహ్వానించింది. విశ్వంభరుడు కనుసైగ చేసి కాళితో "ఇప్పుడేవస్తా" నంటూఎటో వెళ్ళి పోయాడు. చరణుడు ఒక్కడూ గదిలో తెల్లని పరుపుమీద కూర్చుని బాలీసు ఆనుకొని ఎలక్ట్రిక్ దీపం చూస్తున్నాడు. కాళి అతని దగ్గిరసా కూర్చుని పైటతో విసురుతూ, మరోచేత్తో గ్లాసెడు మధువు అతని పెదవులకు అందించింది. చరణుడు విద్యుత్కాంతిలో తళతళ మెరిసే మద్యము చూచి "ఆప ద్బంధూ!" అంటూ తాగుతున్నాడు.

"నేను మీకు ఆపద కలిగించానా?" అంది కాళి నవ్వుతూ.

"నువ్వు నాకు ఆపద! ఆపద మరిచి పోవాలని తాగే స్తున్నాను."

అతని మాటవిని, కాళి, తల నేలకు కొట్టుకోవాలను కొంది. అతను తాగిన గ్లాసు విసిరివేయగా మంచం దగ్గిరే వున్న సోఫాకు తగిలి ముక్కలయింది. గాజుముక్క భద్రకాళి నుదుట తగిలింది. అయినా అతనికోసం ఓర్చుకొని దెబ్బ తగిలినచోట కట్టు కట్టుకొన్నది.

భద్రకాళి ముసలితల్లి "తలకు కట్టు కట్టావేమి?" అని అడిగింది.

"తలనొప్పి; మరేమీ కాదు" అని సమాధానం చెప్పి తప్పించుకొంది.

బాలీసు ఆనుకొని హారిచరణుడు తీవ్రంగా "కాళీ! నా తెలివితేటలు ఇంకా పోలేదు. అన్నట్టు నీకు దెబ్బ తగిలింది. కా... ళీ, నిన్ను ముట్టుకో... ... లేను. నీవంటే నాకు... ... అసహ్యం..." అన్నాడు. హారిచరణుడు.

భద్రకాళి చీరకొంగుతో కళ్లు తుడుచుకొంది. చరణుడు పరుపుమీద పరుండి తల బాలీసుకు రుద్దుతూ పొర్లినాడు. కాళి అతని ముఖం పైకెత్తబోయింది.

"ఛశ్! నన్నంటుకోకు ... ... పాపం చేస్తున్నాను. వెలుతురులోంచి అంధకారంలోకి వచ్చాను. ఇక్కడ ఉండడానికే తాగుతున్నాను. నాకీ లోకంలో ఎవరూ లేరు ... హ్వా కాదు కాదు ... ... ఒక్క మిత్రుడు మాత్రం ఉన్నాడు."

అతని మాటలకు భద్రకాళి ఖిన్నురాలయింది. లోలోపల విచారం దిగమింగి ఏమీ జవాబు చెప్పలేదు. జాలిగా అతన్ని చూచింది.

ఆమె స్తిమిత ప్రకృతి చూచి హారిచరణుడు ఆశ్చర్యపడుతూ "అబ్బ! నీలో ఎంత సహనశక్తి ఉంది? తిట్లు దీవెనలు చీత్కారాలు అన్నీ సహించగలవు" అన్నాడు.

వేశ్యా ప్రకృతిలో భద్రకాళి అతనికి అపురూపంగా కనిపించింది. గాజుపెంకు నుదుటికి తగిలినా, బాధగా ఉన్నా పల్లెత్తుమాట కాళి అనలేదు. మళ్ళీ కొంతసేపటికి చరణుడి ఆలోచన మారిపోయింది. నిషా క్రమేణా ఎక్కువవుతున్నది. పక్కమీద వెల్లకిలా పరుండి చరణుడు గంభీరంగా ఉపన్యాసం

మొదలుపెట్టాడు—"ప్రేమ...ప్రేమట ... ... స్త్రీజాతికి ప్రేమ కల్ల...నాటకరంగంలో ...పాత్రలు రంగులు వేసుకొని ఫిరాయిస్తూ ఉంటారు. ... ప్రేమ నటిస్తారు. ప్రపంచంలో అంతా వేషం... వేషం."

భద్రకాళి కొంతసేపు చిన్నబుచ్చుకొన్నది. ఒక ఉద్రేకపు వెల్లువలో హరిచరణుడు పూర్వం అన్నదేమిటో మరిచి పోయి "కాళీ! ఓకాళికా! ఒక్కపాట పాడవే!" అని కోరినాడు. అతను చేసిన చీత్కారాలు కాళి వెంటనే మరిచి పోయి ప్రణయ భావావేశంతో తంత్రులు మీటుతూ మీరా దేవి 'పదావళి' లో ఒకగేయం అందుకొని కమ్మగా యిలా పాడింది :—

"నిశోదినా పంథ్ నిహారూం, పివకో
బార్ బార్ ఉర లాగీరీ"

ఆ చరణం చరణుణ్ణి ఉద్రూత లూగించింది. రసావేశంతో అతను "ఓహో ప్రేయసీ! ఎన్నో పగళ్ళు, ఎన్నో రాత్రులు నీకోసం తపించానే! ఎక్కడున్నావో ప్రియురాలా!" అని కేకలువేశాడు.

భద్రకాళి అతనివి ఉన్మత్త ప్రలాపాలనుకొంది. కాని అలా అనుకొని సమాధాన పడలేదు. ఎవరీ ప్రియురాలు? ఎవరినో ప్రేమించినాడు. భగ్నహృదయంతో బాధపడ్డాడు. ఎవరా ప్రేయసి? విశ్వంభరుడు ఇతని ప్రియురాలి సంగతి చెప్పనైనా లేదే?" అనుకొంది.

9

మళ్ళీ హరిచరణుడు ప్రలాపన సాగించాడు — "హాఫీజ్ మహాకవి అంటాడు. 'ఏ వస్తువయినా బద్దలయితే పనికిరాదు, హృదయం బద్దలయితే అమూల్యం !" పగిలిన హృదయం అమూల్యమయినా కాకపోయినా యాతన ఎలా సహించడం ?

ఆహా!... ఇప్పుడు... ఇప్పుడు... ఏకోరికా లేదు... ఏ అభిమానం లేదు.నమ్మకాలు లేనే లేవు... వేదనే లేదు ... ఆహా... విస్మృతి శయ్యాంచలాలు... నీల గగనపాళులు......లోకాంచలాలు... ...గగన కామినీ గండపాళులు... ..." అతని కవిత్వం—ఉన్మత్త ప్రలాపన భద్రకాళికి ఆశ్చర్యం కలిగించాయి.

అతని ముఖం కందిగడ్డలాగ ఎర్రనై స్వేదముతో తడిసింది. కాళి చీరకొంగుతో అతని ముఖం అద్దింది. కొంత సేపు విసిరింది. అతని నేత్రాలు మూతపడేదాకా అతని పక్కనే వుంది.

## ఎనిమిది

మర్నాడు హరిచరణుడు విశ్వంభరుని దగ్గిరికి వెళ్ళేసరికి తల్లికి చాలా జబ్బుగా వుందనీ, వెంటనే రమ్మనీ విహారి తంతీ ఇచ్చాడు తల్లికి అనేకసార్లు కష్టాలు కల్పించినా, ఇంటికి కావలసినవి తీసుకు రాకపోయినా ఎంతో సహనం చూపిన జననిమీద అతని భక్తిభావం పొంగిపోయింది. కుటుంబ

విషయంలో తనెంత కఠినంగా ప్రవ ర్తించాడో తలుచుకొని విచారించాడు. విశ్వంభరుడిదగ్గిర డబ్బు తీసుకుని హారిచరణుడు తాల్ సోనాపురం వెళ్ళినాడు. తల్లిని ఆఖరిసారి చూ చేందుకు వీలు లేకపోయింది. ఇంట్లో చరణుడు అడుగు పెట్టేసరికి అంతా గొల్లుమన్నారు. తారిణి గోడకు అంటుకుపోయి కళ్ళల్లో ప్రాణాలునిలుపుకొని జీవచ్ఛవంలా వుంది. తారిణీదేవి భర్త, మిత్రుడు విహారీ ఇంట్లో మంచీచెడ్డా చూస్తున్నారు.

తల్లికి అగ్నిసంస్కారం చేసి వచ్చాక హారిచరణుడు వసారాలో గోడనానుకొని బాధలు ఒకదానివెంట ఒకటి రావడంవల్ల, ఏడవడానికి కూడా ఓపిక లేక దిగాలబడి కూర్చున్నాడు. కొంతసేపటికి "చెల్లాయీ తారిణీ! ఎలాగ బెంగపెట్టుకొంటే ? పోయిన అమ్మ రాదు కదా!" అంటూ చరణుడు చెల్లెల్ని ఓదార్చాడు. తల్లి బ్రతికివుండగా, అతను చెల్లెల్ని ఎప్పుడూ ఆప్యాయంగా పిలిచి, మాట్లాడి, కష్ట సుఖాలు ఒకరొకరు చెప్పుకొని ఎరగరు. అన్నగారిలో కలిగిన మార్పువల్ల తారిణి అతని హృదయ సమీపానికి రాగలిగింది. విహారి ఇద్దర్నీ ఓదార్చాడు.

చరణుడు కంట తడిపెట్టి ఇలా అన్నాడు. "విహారీ నీ ఋణం తీర్చుకోలేను. నేను తల్లికి సేవచేసి మాత ఋణం తీర్చుకోలేని కృతఘ్నుణ్ణి! నాకు సోదరుడివి కాకపోయినా, సోదరుడిలాగ నా ధర్మం నీవు నెరవేర్చావు." అతని కన్నీళ్ళలో సంతోషం వెలిగింది.

"మీ కుటుంబము ఇలా చితికిపోయిందే అని బాధ పడుతున్నాను. బాధపడి నేను చేయగలిగిందీ లేదు." అన్నాడు విహారి.

చరణుడు అన్నాడు "అమ్మాయీ తారిణీ! విహారి నిజంగా నాకు బావ కాకపోయినా ఒక ఉద్దేశం నా మనసులో ఉంది. నువ్వూ విహారీ ఇద్దరూ వివాహమైందితే మన కుటుంబాలు కలిసిపోతాయి. ఋషులు ఎలా అడ్డం తగులుతారో చూస్తాను. మైత్రి బంధుత్వంగా మారుతుంది." విహారి చిరునవ్వుతో అంగీకారం తెలియచేశాడు.

తారిణీదేవి మాతృవియోగ దుఃఖంలో ఉన్నా, అన్న మాటకు మలినంగా మందహాసం చేసింది. తారిణి కాపరానికి వెళ్ళి పదేళ్ళు దాటాయి. వంశాంకురం బయలు దేరలేదు. ఆమె భర్తకు వయసు ఏనాడో చెల్లింది. తారిణికి ఆశమాత్రం పోలేదు, వార్ధక్యంలో నయినా బిడ్డ కలగక పోతుందా అని. నోములూ వ్రతాలూ తీర్థయాత్రలు ఎన్నో అయినాయి. తల్లి జీవించినంత కాలం, హరిచరణుడు బికారి అయిపోయాడనీ, కూతురికి పిల్లాజల్లా లేరనీ, భర్త సాధువుల్లో కలిసి పిచ్చివాడయి పోయాడనీ, మనోవ్యధ పడుతూ వుండేది.

కర్మ పదిరోజులూ యథావిధిగా చేశాడు చరణుడు. అతని పినతల్లి కొంచెం స్థితిపరురాలు కావడంవల్ల శ్రద్ధకర్మకు అయిన సమస్త ఖర్చులూ భరించి గోదానాదులు చేయించింది. అక్కడ కొడుకు, చరణుడు పాడై పోయాడని, కష్ట సమయంలో ఆదుకోకపోతే దిక్కు ఎవరూ లేరని తలచింది.

" అబ్బాయి హరీ! కుదురుగావుండి నా ఇల్లూ వాకిలీ చూడు తండ్రీ " అంది పింతల్లి.

అతనికి వల్లమాలిన అభిమానం వచ్చింది. ఆమె సొమ్ము తింటూ మాటలు పడుతూ ఉండడము అతనికి రవంతయినా ఇష్టంలేదు. తల్లి పోయింది కనక పింతల్లిగారి గుమ్మం తొక్కినాడు. పింతల్లిగారి తాల్ సోనాపూర్‌లో హరిచరణుడు ఉండదల్చుకోలేదు. నిర్భాగ్యుడు బికారి అయిన చరణుడు విరగడయి పోతే మరీ మంచిదని ఆమె అనుకొంది. అతనికి తావు ఎక్కడా లేదు. ఇవాళ ఉన్న చెల్లెలు రేపు యథాప్రకారం అత్తారింటికి వెళ్ళిపోతుంది. ఇంక తనకు విశాల ప్రపంచంలో చోటు లేదు. అంతా శూన్యంగా బెంగగా వుంది. ఇంతవరకూ హరిచరణుడు అరుణతార విషయం విహారితో ప్రస్తావించలేదు. విహారి సమయంకాదని మాటే మాట్లాడలేదు.

" భగవంతుడా! దిక్కులేని పక్షికి నువ్వుతప్ప ఆధారం లేదే? ఈ నిర్భాగ్యుడి జీవితం ఇలా వెళ్ళిపోవలసిందేనా? నా ఇచ్ఛ నన్ను పడదోస్తున్నది. ప్రభూ! అయ్యో అంధకార కూపంలో పడిపోతున్నాను ప్రభూ! నీ ఇచ్ఛానుసారం యంత్రంలాగ నన్ను నడిపించు భగవంతుడా! " అని చరణుడు మౌన బాష్ప నయనాలతో వినమ్రుడై ప్రార్థన చేశాడు.

విహారి ప్రశ్నించాడు: " చరణ్ ఎప్పుడు బయలు దేరుతావు! ఎక్కడికి? " అని

" ఇప్పుడేనోయ్. నాకేంపని ఇక్కడ. కలకత్తాలోనే ఉంటాను, ఎక్కడో ఒక దిక్కున " అన్నాడు చరణుడు.

" నాతో వుండు చరణ్. ఏ షాపులోనయినా ఉద్యోగం చేద్దువుగాని. నీకు లోటుండదు. "

" నేను ఎక్కడా స్థిరంగా వుండలేను. విహారీ! అప్పుడప్పుడూ నువ్వు కనపడుతూ వుండు. అంతేచాలు. "

" నేను రాసిన ఉత్తరం అందే వుంటుంది నేను వేరే చెప్పవలసింది లేదు. "

" విహారీ! నేను మనస్సు నిలకడ చేసుకో లేకపోతున్నాను " దీనంగా అన్నాడు చరణుడు.

" అంతవరకూ బాధలు తప్పవోయ్ "

" నిజమే విహారీ! "

## తొ మ్మి ది

హారిచరణుడు కలకత్తా వచ్చాడే కాని వచ్చినప్పణ్ణించీ భద్రకాళిని చూడాలనే పేరేపణ హృదయంలో రేగుతూ వచ్చింది. తను ఎంత చీదరించుకొన్నా ఎంతో సహనం చూపిన భద్రకాళి అతని తలంపులో మెలుగుతూనే వుంది. తనను కొంతవరకూ అధోగతి కీడ్చిన విశ్వంభరుడు దగ్గిరికే తిరిగి చరణుడు వెళ్ళినాడు. ఇద్దరూ నిత్యమూ తాగుతూ వివేకము పోగొట్టుకొంటూ వున్నారు. విశ్వంభరుడితో చెప్పకుండా హారిచరణుడు చిత్

వూరు వెళ్ళారు కాళికోసం. గుమ్మంలోకి వెళ్ళిచూ స్తే తలుపు తాళంవేసి వుంది. భద్రకాళి ఊళ్ళో లేదేమో, ఎక్కడికయినా వెళ్ళిందేమో అని చరణుడు అనుకొన్నాడు. పక్క మేడలో వున్న వాళ్ళను సిగ్గువిడిచి అడిగాడు "ఈ మేడలో భద్రకాళి ఏమయింది? ఎక్కడికి వెళ్ళింది?"

ఇరుగు పొరుగువల్ల కాళి మకాము తెలుసుకొని అతను బయలుదేరినాడు. అతను అక్కడ ఉండగానే కొందరు పెద్దమనుష్యులు రిక్షాల్లోవచ్చి భద్రకాళి సంగతి తెలియక, అడిగితే అవమానమని తలవొంచుకు పోతూవచ్చారు. వాళ్ళు మాట్లాడుతూ ముందు పోతూవుంటే వెనక రిక్షాలో హరిచరణుడు జాగ్రతగా వారిమాటలు విన్నాడు.

ఒకకంఠం "అది బస మార్చేసి ఎక్కడుంటుం దంటావు?" వాళ్ళు రిక్షావాణ్ణి అడిగితే తనకు తెలియ దన్నాడు. 'వృత్తి మానేసిందా వారంనుంచీ కనపడదు."

"మానేసిందనే విన్నాను బాబూ"

'వేశ్య. వృత్తి మానడమేమిట్రా? నమ్మదగ్గదే! పడుచుకారులో ఉంది. మూడుపూవులు నాలుగు కాయలుగా ఉండాలికదా! కాళి వృత్తి మానేయడమా? మన్మధుడికి ముసలితనమా?"

"చిత్తం ఏమోనండి"

"ఎక్కడైనా వుందీ ధర్మం?"

ఆమాటలు హరిచరణుడికి ఆశ్చర్యం కలిగింది. కాళి వృత్తి మానేసి సంసారస్త్రీలుండే జాగాలో కాపరం పెట్టి నందుకు అతని ఆశ్చర్యానికి అంతులేదు. ఎందుకలా చేసిందో అంత మార్పుకు కారణము ఏమై వుంటుందో తెలుసుకోవాలని అతను ఆదుర్దాగా వున్నాడు. చరణుడు విన్న దాన్నిబట్టి దీప స్తంభం ముందున్న ఇంటిదగ్గర ఆగి పచార్లు చేస్తున్నాడు. కిటికీలో ఒక ముఖం కనపడింది. అయితే దీపకాంతి అటు ప్రసరించక పోవడంవల్ల ఎవరయిందీ తెలియు లేదు స్పష్టంగా, అనుమానిస్తూ "భద్రకాళి ఇక్కడే ఉంటున్నదా ?" అని ప్రశ్నించాడు.

తలుపు తెరుస్తూ "హరిబాబుగారు దయచేశారా ?" అన్న పరిచిత కంఠం వినవచ్చింది.

"భద్రకాళి ఎక్కడ ?" ఆదుర్దాగా అడిగాడు.

"పైకి దయచెయ్యండి" అని సమాధానం.

"నువ్వా ? సరేపద" అంటూ డాబామీదికి వెళ్ళాడు.

"నన్ను మరిచిపోయారా బాబ్తిగా" అంటూ, నల్లచీరతో, నగలులేని బోసితనంతో, సంస్కారలేని కేశ పాశముతో భద్రకాళి ఎదురై చిరునవ్వుతో ఆహ్వానించింది. హరిచరణుడి ఆశ్చర్యనికి హద్దులేదు.

"నువ్వేనా కాళీ !" అంటూ ఆమెను పరిశీలించి చూచాడు. భద్రకాళి, నవకం తగ్గి కృషించి పోయింది సన్నని నీటిపాయులాగ.

"ఏం ఇలా చిక్కిపోయావు ?"

"జబ్బేమీ లేదు. శరీరం బాగానేవుంది."

డాబా గదిలోకి వెళ్ళి చూచేసరికి గోడలకు తైలవర్ణ చిత్రాలుగాని, శృంగార చిత్రాలుగాని ఏవీ లేవు. గోడమీద సాలీళ్ళు జాలరు అల్లినవి. నిరాలంకారంగా వున్న గదిచూచి అతను తెల్లపోయాడు.

"ఇంత ప్రమాదం సంభవించిందేమి కాళీ ?"

"ప్రమాదం కాదు నా భాగ్యం" అంటూ అతని పాదాలచెంత కూర్చుంది. అతని పాదాలు ముట్టుకోబోయి "మీ పాదాలు అంటవచ్చునా ?" సందేహంగా అంది.

అతను చిరునవ్వు నవ్వి అంగీకారం కనబరచినాడు.

అంతటతో ఆమెకు పూర్ణమైన తృప్తిలేక అతని పాదాల మీద తలమోపి నిశ్శబ్దంగా కన్నీరు కురిపిస్తూ "చరణా ! ప్రియచరణా ! ఇక్కడ కొంచెంచోటు ఇవ్వరా ?" అని కాళి జాలిగా అడిగింది.

ఆమె అశ్రువులతో తడిసిన తన పాదాలు కదల్చి ఆమె గడ్డం చిగురు పట్టుకొని ముఖం పైకెత్తి చూచాడు హరి చరణుడు.

"ఎన్ని నదులయినా నా పాప పంకిలాన్ని కడిగివెయ్య లేవు. ఈ తుచ్ఛురాలిని, అపవిత్రురాలిని ఆదరిస్తారా ?" అని అడిగింది. ఉద్రేకంవల్ల సమాధానం చెప్పలేక అతను మనసు చిక్కబట్టి ఆమె తలకట్టు, బుజాలు కపోలాలు స్పృశించి,

మాటా పలుకాడుతూ హృదయ సంతృప్తి కలిగించాడు. ఇద్దరూ చాపమీాది పరుపుమీాద కూర్చున్నారు.

ఉద్రేకం తగ్గిన తరువాత అతను "శాలీ! ఆభరణాలు అన్నీ ఏంచేశావు?" అన్నాడు.

"అమ్మేశాను"

"సామాన్లు?"

"అప్పీసి"

"బేరసారాలు"

"బేరసారము లుడిగెన్. ఎవరన్నా పసికట్టి వస్తే కాళ్ళు విరగగొట్టి పంపిస్తాను."

"బాబోయ్!" అంటూ తన పాదాలు చూచుకొన్నాడు చరణుడు.

"విశ్వంభరుడు రావడంలేదూ?"

"లేదు"

కొంతసేపు అతను పరాకుగా ఉన్నాడు. మళ్ళీ ప్రశ్నించాడు.

"వ్యాపారం కట్టేసినట్టేనా?"

"కాక మరేమిటి?"

"భుక్తి ఎలాగ?"

"అదివరకే చెప్పాను, నగలు అమ్మేశానని"

"ఎంతసొమ్మొంది?"

" రెండువేలు. అది ఒకరిదగ్గిర పెట్టి వడ్డీతో కాలక్షేపం చేస్తాను."

" ఇదంతా ఎందుకు ? "

కాళి సిగ్గుతో మొదటిసారి తల వాల్చింది. అతని దగ్గిరికి జరిగింది.

" రెండువేల మీద వచ్చే వడ్డీతో కాలక్షేపం ఎలా చేస్తావు ? ఇది మహా నగరం కదా ? "

" చాలకపోతే ఈ నగరం విడిచి ఏ పల్లెటూరో వెళ్ళి పోతాను " అంది.

హారిచరణుడు తెల్లపోయినాడు.

" ఒకవేళ నేను వెళ్ళేటట్లయితే మీతో ఒక విషయం చెబుదామనుకొంటున్నాను. నన్ను మీరు కలుసుకొన్నప్పుడు చాలా చీదరించుకొన్నారు. బహుశా నా జీవితంలో అంతగా, ఎవరూ నన్ను చూసి అసహ్యించుకోలేదు. నన్ను మీరు రోతగా చూచినా, మీరెంత గొప్పఇంటి బిడ్డయినా, మీరెంత తెలివైనవారయినా, వద్దన్నా మీరు గుప్పెడు రూపాయలు నావొళ్ళో పోసినా, ఎందుకో మీరు నాకు నచ్చారు. మొదటిసారి నన్ను కలుసుకొన్న రోజుల్లో—మీకు జ్ఞాపకం వుందా ?—తాగుతూ గ్లాసు విసిరికొట్టారు. గాజుపెంకు నాకు తగిలింది. నన్ను గాయపెట్టారు. ఆ గాయం మానిందనుకొన్నారా ? ఇదిగో చూడండి " అంటూ నుదుటనున్న మచ్చ చూపింది. చరణుడు ఆశ్చర్యపడ్డాడు.

మళ్ళీ ఆరంభించింది.

"చిత్రమైన వ్యక్తిగా మీరు నాకు తోచారు. అప్పణ్ణించీ మిమ్మల్ని నేను మరిచిపో లేకుండా ఉన్నాను. మీరు రాకపోతే ఏదో వస్తువు పోగొట్టుకొన్న దానివలె, కాలుగాలిన పిల్లిలాగ తిరిగేదాన్ని. ప్రతి వస్తువునూ కొత్త దృష్టితో చూడడం మొదలు పెట్టాను. నాలో పాత 'నేను' పోయి కొత్త 'నేను' వచ్చింది. మీకు మద్యము అలవాటయింది. దానికి విశ్వంభరుడు కారణం. నాకు సారా అంటే రోత. అయినా మీకు అలవాటుకదా అని ఇచ్చాను. తాగుబోతును చూస్తే నాకు పరమ అసహ్యం. మిమ్మల్ని మాత్రం సహించాను" అంటూ భద్రకాళి అతని ఒడిలో తలఉంచి కన్నీరు కారుస్తూ "నేను చాలా నీచురాల్ని నా దోషాలు లెఖ చెయ్యకండి. మీరు నన్ను రోతగా చూచినా మీరు నిద్ర పోయాక మీ శరీరం తాకి మీ దగ్గిరికి వచ్చేదాన్ని. మీకు దగ్గిరిగా రావడానికి ఎంతో యత్నించేదాన్ని" వేదనతో పలికింది.

భద్రకాళి హృదయ తాపము హరిచరణుడి హృదయం కరిగించి వేసింది. అదివరకు ఎన్నడూ మాట్లాడని భావంలో కాళి మాట్లాడే సరికి ఆశ్చర్యము వేసింది. వేదనలో ఆనందంలో హృదయం ఉదాత్త రమణీయంగా పలుకుతుంది. రగిలిన గుండె, రాగరక్తమయిన గుండె అసామాన్యంగా పలుకుతుంది. కళ్ళు తుడుచుకొంటూ భద్రకాళి మళ్ళీ తన హృదయం విప్పింది. "ఒకసారి మీరన్నారు జ్ఞాపకంవుందా?

'ఎన్నితిట్లు తిరస్కారాలో నువ్వు సహిస్తావు" అని అన్నారు. అప్పటినుంచీ నావృత్తిమీద నాకు రోత కలిగింది. ఎంతో హృదయావేదన రగిలింది. ఛస్తే ఈ వృత్తి వద్దు. ఈ క్షుద్ర జీవితం గడపకూడదని పశ్చాత్తాపంతో వేడికన్నీరు కార్చాను. మీమాట నాలో మార్పు తీసుకొని వచ్చింది," అన్నది.

"పట్టణంలోవుంటే ప్రలోభాలకు లొంగిపోతా వేమో ?" చరణుడన్నాడు.

"అందుకే పల్లెటూరు పోదామని అనుకొంటున్నాను. అసలు మానవ హృదయం వాంఛలకు వశమవుతుంది. కొన్నాళ్ళపాటు మనసు వాంఛల్లో తృప్తి పడింది. బుద్ధి పూర్వకంగా కోరికలకు దూరమవుతున్నాను. నాకేం భయం?" అంటూ భద్రకాళి అతని రెండుచేతులూ పట్టుకొన్నది.

నన్ను ముట్టుకోవద్దని చరణుడు అనలేకపోయాడు. ఆమె అతన్ని దగ్గిరికి లాక్కొని ముఖంలో ముఖముంచి "మీహృదయం నేను గ్రహించాను. మీముఖంలో వేదన కనపడుతుంది. ఎందుకో చెప్పరూ ?" జాలిగా అడిగింది.

"మాఅమ్మ చచ్చిపోయింది" అన్నాడు ముక్తసరిగా.

"పాపం నాదగ్గిరికి వచ్చినప్పణ్ణించీ ఏదో బెంగగానే ఉంటూ వచ్చారేమి ?"

"నన్ను నమ్మించి, నా వలపుల గిలక మోసం చేసింది," అంటూ నిట్టూర్పు వదలినాడు.

"ఎవరండీ ?" ఆదుర్దాగా అంది.

"ఒక తార ?"

"పేరే తారా ? తారలాగ చంచలమైందా ?"

"అదీ ఇదీ కూడాను. "పైగా గొప్ప కుటుంబం లోంచి వచ్చినపిల్ల"

"గుణానికి ప్రత్యేకం చోటువుండదు. ఏమంటారు ?"

"అవును. అసలు స్త్రీజాతినే విశ్వసించకూడదేమో ?" అన్నాడు.

"ఏమండీ అంతా అలావుంటారా ? మాది వృత్తి కనుక చాంచల్యం ఉండక తప్పదని మీరు అనుకొంటారు"

"అయితే చాంచల్యం నీకు ఇంకావుందా ?"

"లేదు. మీమాటవల్ల వృత్తిమాని నియమాలకు లొంగుతున్నాను. అవునుగాని పాపం, అంత గొప్ప ఇంటిపిల్ల అలా చేసిందేమండీ ?"

"ఏం చెప్పను ? ఎప్పటికయినా మార్పు ఆమెలో వస్తుందేమో ?"

"నాలో వచ్చినట్టు వస్తే నయమే"

"రాదురాదు. శాశ్వ... తీయని వాగ్దానాలు చేసింది అరుణతార. మాట నిలబెట్టుకో లేకపోయింది."

"మీ హృదయంలో పూర్తిగా ఆమెకే చోటు ఇచ్చారు కాబోలు – అయినా పురుషులు అలా చెయ్యరే ?"

"అమాయికంగా అరుణతారను అందల మెక్కించాను."

"ఆమెతో వెంటనే మాట అనేయకండి. స్త్రీలు హృదయభావము వెంటనే తెలియచెప్పరు. ఆమె ఎలాంటిదో నెమ్మదిగా తెలుసుకోలేదు. మీరు తొందరపెడితే, ఏదో మాట అంటే వాగ్దానంగా తీసుకొన్నారేమో?"

"కాళీ మీ ఆడాళ్ళను వెనక వేసుకొస్తున్నావు."

"మొగాళ్ళు పెద్ద ఖబుర్లుచెప్పి ప్రేమిస్తున్నా మంటారు. నేను వ్యాపారంచేశాను చాలా కాలం ఈ జీవితంలో ప్రేమానుభవం ఒక్కసారే కలిగింది. ప్రేమ వేరు రూపాకర్షణ వేరు. మా రూపాకర్షణవల్ల చాలామంది పురుషులు దీపంచుట్టూ పురుగులవలె ముసురుతారు. మీకంటె మాకు మోహం తక్కువ. పురుషుల్ని చూచీ చూడడంతో వెర్రిగా సంచరించం. మీరే-మీపురుషులే ప్రేమ వ్యక్తంచేస్తారు. మిమ్మల్ని బాధపెట్టడానికి సిగ్గు అనుమానం దుఃఖమూ అడ్డుతగుల్తూ ఉంటాయి. మేము తొందరపడి నోరు జారము. ప్రేమించి సమస్తమూ సహిస్తాము. ప్రేమించినవాళ్ళు తృప్తిపడి కుటుంబ కల్లోలం తీసుకురారు. నేననుకోడం అరుణతార మిమ్మల్ని మోసంచేసి ఉండదనీ, మీరే నన్ను అర్థంచేసుకొన్నట్టు ఆమెనూ గ్రహించారనీ"

హారిచరణుని నేత్రాలు అశ్రుపూరితా లయినాయి. కాళి అతని కన్నీరు తుడిచి వేదామనుకొంది. కాని ప్రయత్నం చెయ్యక ఊరుకొంది.

మళ్ళీ భద్రకాళి ఆరంభించింది.

"నన్ను మీరు సరిగ్గా తెలుసుకోలేక పోయారు. మీదృష్టిలో నేను అల్పప్రాణిని. అయితే నాకు హృదయం అనురాగం అంటూ ఉంటాయని మీరు ఎరక్కపోవడం విచారకరం. అయితే నేను మీ రూపానికి మోసపోక రూపం వెనక దాగిన హృదయం గ్రహించాను. నా జీవితంలో ఇదే మొదటిసారి మీవంటి హృదయం గుర్తించడం. నా హృదయ రత్నాకరమే మీరు. మిమ్మల్ని వదులుకోలేను. ఏ స్త్రీ తన అమూల్య నిధిని వదులుకుంటుంది ?" ఆవేశంతో అంది.

చరణుడు నవ్వుతూ 'ఏమిటి కాళీ ఇవాళ అతిగా మాట్లాడుతున్నావు. పొరపాటున తాగలేదుకద ?" అని అడిగాడు.

"మీరే తాగుడుకు అలవాటు పడ్డారు. నేను తాగ లేదు. అన్నట్టు మీరు దురలవాటు మానేశారా ? లేదా ?" సూటిగా కాళి ప్రశ్నించింది.

"నా మిత్రుడు విహారి నీలాగే అడిగాడు. ఇకనుంచీ తాగను. నా తల్లి పోయాక ఒక్కసారి తాగాను. ఒట్టు ! కాళీ, తాగను" అంటూ చేతిలో చెయ్యి వేశాడు.

"మీరు చపలచిత్తులు. మీ మాట నమ్మడమేనా?"

"శపథం చేస్తున్నానంటే నమ్ము"

"మీ వొళ్ళు పాడవుతుందేమోనని చెబుతున్నాను. మీరు చాలా కృషించారు. మీరు నడుస్తూ ఉంటే గమ

నించాను. చాలా నీరసంగా అడుగు వేస్తూ వచ్చారు. నామాట పాటించి అలవాటు విడిచిపెట్టండి " అంటూ కాళి హరి చరణుడి గడ్డం పట్టుకున్నది.

అతనికి అంతా వింతగావుంది. అరుణతారకన్న మిన్నగా ఆమె ఎంతహృదయము చూపిస్తున్నది ?

" కాళీ ! ఎప్పుడయినా అవసరముంటే కబురుపంపు ; వెళ్ళివస్తాను " అంటూ హరిచరణుడు లేచాడు.

" మరిచిపోకండి " అంటూ కాళి అతనికి నమస్కారం చేసింది. అతను వెళ్ళిపోయాక నూన్యదృష్టితో " భగవంతుడా ! ఆయన దర్శనం మళ్ళీ నాకు ఏర్పాటు చెయ్యవా ? " అంటూ కళ్ళు ముకుళించింది. జాలుగా కన్నీరు బుగ్గలవెంట (స్రవించింది.

## ప ది

మద్యపానం మానేసినప్పటినుంచీ హరిచరణుడి వరాలసత్తువ పోతున్నది. అస్తమానమూ కీళ్ళు పట్టేవి. వరాలు నములు తున్నబాధ పడేవాడు. లేవడం, నడవడం, మెట్లెక్కి దిగడం అతనికి యాతనగావుంది. కడుపు ఊరి బానలాగ తయారయింది. అతని శరీరంలో పాటవం తగ్గింది. ఎముకలు కనపడుతున్నాయి. మనిషి నల్లపడి రూపే (క్రమేణా పోతున్నది. ఉన్ననాడు తిండి తినడం లేనినాడు ఏ స్నేహితునిదగ్గిరో డబ్బుచ్చుకొని పానశాల దాకా వెళ్ళి తిరిగి వచ్చే జనాన్ని చూసి, రోతపడి, అతికష్టం

మీద వాంఛను అణగితొక్కి భద్రకాళి మాటలు స్మరిస్తూ వెళ్ళిపోయేవాడు. బలమైన ప్రేరేపణకు వశంకాక కొంత మనస్థైర్యము సంపాయించ గలిగాడు. అప్పుడు కాళిని తలుచుకుని హరిచరణుడు "కాళీ! నిన్ను తిట్టాను కొట్టాను చీదరించుకొన్నాను. అన్నీ సహించావు. నాకు హితముపదేశించావు. పుణ్యం కట్టుకున్నావు. కాంతా సమ్మితంగా చేసిన నీ ఉపదేశం నేను స్మరిస్తూ కొంత మానసిక స్థైర్యము సంపాయించగలిగాను. అందుకు నేను కృతజ్ఞుణ్ణి" అంటూ విశ్వాస బాష్పాలు జార్చినాడు.

తాల్ సోనాపురంలో పింతల్లి అతన్ని రమ్మని ఉత్తరం రాసింది. ఆమెకున్న నాలుగయిదు యకరాల పొలంబాపతు పంట జాగ్రత్త చేసుకొని కాలక్షేపం చెయ్యవచ్చు, తప్పక రమ్మని రాసింది. విహారి ఆమెకు నచ్చచెప్పడంవల్ల ఆమె 'చెడిపోయిన' అక్క కుమారుణ్ణి హరిచరణుణ్ణి రమ్మని రాసింది. అయితే అభిజాత్యంవచ్చి "ఛశ్ నే నా గుమ్మం ఎలా తొక్కను? పరాధీనంగా బతకనా? వితంతువు చేసే శాసనాలకు తలవగ్గి ఎలా జీవించను?" అనుకొని సమాధానము ఏమీ రాయకుండా ఊరుకొన్నాడు హరిచరణుడు.

ఇలా ఉండగా అతని పలుకుబడి చిత్పూర్ రోడ్ దగ్గిర అధికమయింది. అతనిదగ్గిర నాలుగు డబ్బులుంటే నలుగుర్ని పిలిచి పంచిపెట్టేవాడు. సిగరెట్ కాలుస్తూ "రావోయ్ మిత్రమా" అంటూ పదిమందిని చేరదీసి సిగరెట్లు ఇచ్చేవాడు.

పనిపాటలు చేసుకొనే వాళ్ళతో తిరగడం, ఏ తమలపాకుల దుకాణంమీదనో కూర్చోడం, వాళ్ళ కష్టసుఖాలు వినడం, మాట సాయంచేయడం సంభవించేది. పాటకజనం హరిచరణు డంటే తోలువలిచి చెప్పులు కుట్టిచ్చేది. అందరికీ అతను తల్లో నాలుక. చరణుడికి ఏపని కావలిస్తే వాళ్ళంతా ఆ పని చేసి పెట్టేవారు. మంచి మాటకున్న శక్తి, మహాస్త్రానికి లేదు. ఒకనాడు చిత్‌పూర్‌లో అతను కనబడకపోతే ప్రతివాడూ "హరి హరి హరేడీ! ఏమయినాడు" అని ఖంగారు పడేవారు. ప్రజాహృదయం చూరగొన్న హరిచరణుడికి చాలా ధైర్యం. తన అంత్యకాలంలో వాళ్ళే ఆదుకుంటారని అనేవాడు.

నరాల నిస్సత్తువవల్ల క్రమేణా ఒకనాడు చేతికి పక్ష వాతం వచ్చింది. నలుగురయిదుగురు కిళ్ళీ దుకాణాలవాళ్ళు తేనకోసం తలొక వైపుకూ వెళ్ళి తేన సంపాయించి తెచ్చారు.

"ఎందుకురా? ఇంతటితో జీవితం చాలిస్తాను." అని దీనంగా చరణుడు అన్నాడు.

"అలాకాదు హరిబాబూ! మాకోసం మీరు కల కాలం ఉండాలి" అన్నాడు దుకాణదారు మాలీ.

"అదేమిటి సోదరా అలా అంటావు? నాలుగు కాలాల పాటు తిని తిరిగి మాతో ఉండవలసిన వాడివి వేదాంతం చెబుతావేమిటయ్యా" అంటూ శ్యామలాలు బలవంతంచేసి తేన చరణుడినోట్లో పోశారు.

కొన్నాళ్ళదాకా తేన బాగా పనిచేసింది. మొత్తం మీద చరణుడికి శరీరంమీద పీసమెత్తు అధికారం లేకుండా

పోయిందీ. అప్పుడప్పుడూ విహారివచ్చి, కన్నీరు కార్చి వెళ్ళి పోతూ ఉండేవాడు. మాలీ డబ్బు పుచ్చుకోకుండా చరణుడికి ఎప్పుడు కావలిస్తే అప్పుడు సిగరెట్లు, కిళ్ళీలు, సోడా, మిఠాయి ఇచ్చేవాడు. తన కొట్టుపక్కనే చిన్న గది హారిచరణుడికి ఏర్పాటు చేశాడు. గదిముందు అరుగుమీద అతను అధిష్టించగా, శ్యామలాలు, దులారీ, కాయస్థ, కిశోరీ మొదలయిన వాళ్ళంతా కొలువు తీర్చేవారు. అంతా ధూమం వదలుతూ రాత్రి నిద్ర పట్టేదాకా లోకాలోక పర్యంతందాకా కబుర్లు చెప్పుకొనేవారు. అందరికీ సలహాలు ఇచ్చేవాడు చరణుడు.

అతను ఒకరాత్రి అరుగుమీద పరుండి అనుకొన్నాడు. "ఇక్కడి వాళ్ళంతా నన్ను గౌరవిస్తారు. నెత్తిమీద పెట్టుకొంటున్నారు. నేను చనిపోతే వీళ్ళు నన్నుగురించి ఏం చెప్పుకొంటారో? ఎంత వనికి మాలిని వాడయినా చచ్చిపోయి। పజా హృదయం కరిగిస్తాడు. అయ్యో పాపం అంటారు అందరూ"

చీకటితోనే లేచి చరణుడు చిత్పూరు విడిచి ఎక్కడికో వెళ్ళిపోయాడు. రెండుమూడు రోజులయినా తిరిగి రాలేదు. మాలీ కొట్టుదగ్గర అంతా గూడుపుఠాణీ చేశారు. మూడో మధ్యాహ్నం మాలీకి ఎక్కణ్ణించో కార్డు వచ్చింది. వాడి జన్మలో వాడు ఎవరికీ ఉత్తరం రాసిన పాపాన పోలేదు. కిశోర్ పరుగెత్తుతూ వచ్చి "మాలీభాయ్, హారిబాబు దగ్గిర్నించా?" అని ఆదుర్దాగా అడిగినాడు.

మాలీ "అవును భాయ్. కొంచెం చదివిపెట్టు" అని అడిగాడు.

ఆ మూతాలో అక్షరంముక్క ఒక్కరికీ రాదు. తోవనే పోయే పెద్దమనిషికిచ్చి ఉత్తరం చదివించారు.

కలకత్తా మార్చి ౧౦

" మాలీదాదా!

చాలా దుఃఖభారంతో ఈ ఉత్తరం రాస్తున్నాను. ఇక్కడ కాలవగట్టున స్నానంచేస్తూఉండగా పడవ ఢీకొన్నది. తల పగిలి హరిబాబు చచ్చిపోయాడు. మనందరినీ నడియేట్లో ముంచిపోయాడు. అతని తాలూకు వస్తువులు, అతని చక్కని చేతిసంచీ, ఉత్తరాలకట్ట అన్నీ జాగ్రత్త చెయ్యాలి. అయ్యో! ఏడీ అలాంటివాడు!

మిత్రుడు విహారి. "

చదివీ చదవడం తరవాయి. మాలీ కళ్ళమ్మట నీళ్ళు పెట్టుకొని, "నన్ను గంగలో దింపి పోయావా? నాతో చెప్ప కుండా ఎక్కడికిపోయావు చరణ్ " అని విచారించాడు.

" మృత్యువు వచ్చేటప్పుడు చెప్పిరాదు " అంటూ ఆ పెద్దమనిషి వెళ్ళిపోయాడు.

మాలీ దుకాణం కట్టేసి విచారంతో చరణుడి గదిలో చేరి అతనిసంచీ, చిన్నదువ్వెన, అద్దం, ఉత్తరాలు—అరుణతార ఎప్పుడో పూర్వాశ్రమంలో రాసినవి—అన్నీ భద్రంచేశాడు! ప్రపంచ నాటకరంగంలో ఒకపాత్ర నిష్క్రమించిన మాత్రాన నాటకం ఆగిపోతుందా? రంగశాలకు ఏమయినా లోపమా? సూర్యుడు యథాప్రకారంగా ఉదయిస్తాడు. అస్తమిస్తాడు.

కాయస్థుడు కొంత తెలివి తెచ్చుకుని "వారే ఉత్తరం చదివించారు గాని, హరి ఎక్కడికి పోయాడో తెలిసిందా?" అన్నాడు.

"ఉత్తరంలో ఎక్కడ చనిపోయిందీ లేదు" అంటాడు కిశోరి.

"అయ్యో పోస్టుముద్రయినా కనిపెట్టండి" సమయస్ఫూర్తిగా మాలీ అందుకున్నాడు. భూతద్దాలవంటి జోళ్ళు కళ్ళకు తగిల్చి, తిరగేసి మాదేసిన అక్షరాలు గుర్తుపట్టి 'తాల్ సోనాపూర్' అని చదివినాడు.

"కాలవలో స్నానంచేస్తూన్న హరిచరణుడు, పడవొస్తే తప్పుకోలేడా?" మాలీ అన్నాడు.

"గుద్దేశిందేమో రా" అన్నాడు కిశోరి.

"ఏమో, వాడు చచ్చిపోడు రా. అది నా నమ్మకం"

"నీ నమ్మకం నీది. చావుదారి చావుది" అన్నాడు లాలు.

"నరాల పట్టులేక అసలు వాడు కాలవలోకి ఎలా దిగాడని? పోనీ దిగాడనే అందాము. పడవొస్తే తప్పుకోడానికి ఈతరాదే వాడికి" అని మాలీ.

# పదకొండు

విశ్వంభరుడు నిత్య విధి తప్పకుండా సంజవేళ సారాదుకాణానికి వెళుతూ, తోవలో హరిచరణుడి మరణంవిని, ఆరోజు వైరాగ్యంతో తాగుడు మానేశాడు. ఇంటిపట్టున కూర్చుని "అయ్యో హరిచరణ్! నన్ను విడిచి పెట్టావో.... అందుకే నీకు మరణం వచ్చింది. హాయిగా ఇక్కడే ఉండి, తాగుతూ కష్టాలు మరిచి పోతూ ఉందా మనుకొన్నామే" అని అనుకొన్నాడు.

ఇటీవల కొంతకాలంనుంచి విశ్వంభరుడు భద్రకాళి దగ్గిరికి వెళ్ళడంలేదు. కాళి వృత్తి మానేసి మడికట్టుకొన్నదని అతనికి కోపం వచ్చింది. మకాంకూడా ఎత్తేసి, ఎక్కడో సంసార స్త్రీలుండే చోట కాళి సదాచారంగా ఉంటున్నదని విని నిరాశ పడినాడు. ఆమె హరిచరణ్ణి ప్రేమిస్తోందని విశ్వంభరుడు అదివరకే గ్రహించడంవల్ల, మిత్రుడి మరణవార్త కాళికి చెబుదామనుకొన్నాడు. తత్కాలీన ఆశ్రమావస్థలోంచి, ఏతత్కాలీన పతివ్రతాత్వంలోకి ఎగిరి గంతేసిన భద్రకాళీ ముఖం ఎలా చూడడమని అతను ఆలోచనలో పడ్డాడు. ఈ దుర్వార్త ఆమె చెవిని వేస్తే ఎలాగూ బాధపడక మానదు. అలా ఆమె బాధ పడుతూవుంటే విశ్వంభరుడు చూడలేడు.

ఆమెను చూస్తే అతను వ్రతభంగం చేయాలని పిస్తుంది ప్రియుడికోసం కంట తడిపెడుతున్న కాళితో తనెలా సరస మాడతాడు? ఇదంతా దూరాలోచన చేసి ఎందుకయినా మంచిదని కాళి దగ్గిరికి వెళ్ళడం మానేసి కబురంపించాడు.

కబురు తెలియకముందు భద్రకాళి చక్కగా జడల్లు కొంటూ ఇంట్లో కూర్చున్నది. ముసలితల్లి "ఏమే పిల్లా ఆ బ్రాహ్మడిమూలాన వృత్తి బుగ్గయి పోయింది. ఎలాగే? చక్కగా పువ్వులెట్టుకో చూస్తాను. నీకోసం ఎవరినన్నా చూస్తాను" అంది యాదాలాభంగా.

భద్రకాళి కాళికా మూర్తిలాగ గద్దిస్తూ "ఛీ ఏంమాటలే? ఈశరీరం హరిచరణుడికే అర్పించాను. పరాయి వాణ్ణి భర్త్రీ తలపెట్టను." అని గంభీరంగా సమాధాన మిచ్చింది. తల్లిమాట తీశయ్యాలేక మల్లెదండ అర్థ చంద్రాకృతిగా సిగకు కట్టుకొన్నది. తిలకం తీర్చి దిద్దుకొని, అంతటితో ఊరుకోక పాపిట సిందూరంకూడా పెట్టుకొన్నది. ఎర్రంచు చీర కట్టుకొని ముసుగు వేసుకొని చిన్న అద్దంలో రూపు చూసుకొన్నది.

సరిగ్గా అప్పుడే విశ్వంభరుడి దగ్గిర్నుంచి మరణవార్త వచ్చింది. చరణుడు పోయినట్టు విని పిడుగులాటిమాట వినలేక కెవ్వున కేకవేసి నేలమీద పడిపోయింది. ముసిలితల్లి, "అయ్యో కూతురా! ఏం చేతునే" అంటూ గుండెలు బాదుకొంటూ, తోచీతోచక కాలుకాలిన పిల్లిలా తిరిగింది.

పొరుగునున్న శ్యామసుందరి గగ్గోలువిని పడిపోయిన శాలి మీాద నీళ్ళు దిమ్మరించింది. శాలికి తెలివి వచ్చింది. మెల్లగా లేవగలిగింది.

## పన్నెండు

హరిచరణుడిమీాది ప్రేమవల్ల విహారి అతన్ని గురించి పత్రికలో 'అశ్రుతర్పణం' అనే శీర్షికతో రాశాడు. చరణుడి వియోగ వ్యథలో అరుణతారకు రాసిన ఉత్తరాలు మాలీ దగ్గిర్నుంచి తెప్పించాడు; ఒక సంపుటంగా అచ్చువేయాలని ప్రయత్నిస్తున్నాడు. గ్రంథం అచ్చుకు ఎంత ధనమయినా ఇస్తానని భద్రశాలీ తెలియచేసింది. మిత్రుని మరణవార్త అరుణకు తెలిసిందో లేదో అని విహారి, పత్రికలో ముద్రితమయిన 'అశ్రుతర్పణం' విడదీసి పంపినాడు. తార సంగతి తెలుసుకోవలెనని విహారి కుతూహలంగా ఉన్నాడు.

అతను ఒకనాటి సాయంకాలం ఐస్‌పార్లోరులో పానీయము తాగుదామని బయలు దేరినాడు. గుమ్మంలో సన్యాలు నవ్వుతూ "ఏమండోయి దారి తప్పివచ్చారు" ఎటకారంగా అన్నాడు.

"మార్గశ్రమ మీారు పోగొట్టేస్తారు. దారి తెలుసుకునే వచ్చాను" అన్నాడు విహారి.

"అవునుగాని ఈ మధ్య కబురొకటి విన్నాను. ఎంత వరకు నిజమో?"

"ఏమిటది ?"

"హరిచరణుడు చనిపోయాడని—ఏ ప్రొద్దున్నో కాల వలో స్నానంచేస్తు చేస్తూండగా, పడవ దగ్గిరసా వస్తే తప్పుకోలేక ఢీకొని తల పగిలి మరణించాడని..."

"నేను పత్రికలో చూశాను సన్యాలూ"

"అతను చనిపోవడమేమిటి ?

"మనిషి చనిపోవడం వింత ఏమిటి ? పానీయం తెప్పించండి" అంటూ విహారి కూర్చున్నాడు కుర్చీలో.

క్షణంలో మెరుపు తీగలాగ అరుణతార బాత్ చేసుకొన్న జుట్టుతో, సీతాకోకచిలుకలా ఎత్తుజోళ్ళు టకటక లాడించుకొంటూ హిమశీతల పానీయం తెచ్చి, విహారి ముందున్న బల్లమీాద ఉంచి వెళ్ళిపోతున్నది. అప్పుడు సన్యాలు కోసం ఎవరో హారన్ కొట్టినారు.

"తారా ఆయనకు కావలసింది కనుక్కో" అంటూ సన్యాలు మోటారులో ఎక్కి వెళ్ళిపోయాడు. సన్యాలు అలా వెళ్ళిపోవడం అరుణతారకు కొంచెం చిక్కుగా వుంది. విహారితో ప్రసంగం చేదామని ఆమెకు తలంపులేదు.

ఆమె వేషం పూర్వాశ్రమంలో ఉన్నట్టు లేకపోవడం వల్ల విహారి కొంచెము ఖంగారుపడి తెప్పరిల్లినాడు. ఆమెను చూశాక ఆమె స్వభావం కొంతవరకూ అతనికి తెలిసింది. చరణుడి మరణవార్త ఆమెకు చీమకుట్టినట్లయినా లేదు. హిమ శీతల పానీయం తయారు చేసేచోట ఉండడంవల్ల ఆమె

హృదయంకూడా జడమై ఘనీభవించిందేమో ! పానీయము అతను మెల్లగా తాగుతూ ఉండగా తార పత్రికచూస్తు కూర్చుంది. కొంతసేపు బల్లమీద చిత్రాలు తిరగవేసింది ముందు ఆవిడ పలకరి స్తే విహారి పలకరిద్దామని అనుకొని ఆమె ధోరణి కనిపెట్టాడు. తార ముఖంలో సంతోషమూ లేదు, దుఃఖమూ లేదు, ఏ భావమో ఆ ముఖారవిందం స్ఫుటం చెయ్యలేదు. హృదయం చాలా లోతయినప్పుడు తొణకకుండా సమంగా ఉండడం సహజం. భావ భరిత హృదయం కావడంవల్ల మాట్లాడ లేక పోయిందేమోనని అతను అనుకొన్నాడు. ఆమె వేషాన్నిబట్టి చూస్తే ఆమె హాయిగా వుందని అర్థమవుతున్నది.

పలకరించి తీరాలని సంకల్పించుకొని విహారి అన్నాడు: "ఏమండీ నన్ను ఎక్కడయినా చూచిన జ్ఞాపకంవుందా ?" అని ప్రశ్నించాడు.

"నో, థాంక్స్" అని గంభీరంగా సమాధాన మిచ్చే సరికి అతను నిర్విణ్ణుడైనాడు.

కొంతసేపటికి "నన్నెప్పుడూ చూడలేదా ? హరి చరణుడితో శరణాలయానికి తరుచుగా వచ్చేవాణ్ణి" అన్నాడు విహారి.

"హరిచరణుడితోనా ?"

"మరేనండి"

"క్షమించాలి. జ్ఞాపకం వచ్చింది. ఈ వ్యాపారసంస్థలో రాబడి ఎక్కువ కావడంవల్ల లెఖా డొక్కా అజమాయిషీ

నేనే చూస్తూండడంవల్ల ఇతరమంతా జ్ఞాపకం వుండదు" అన్నది.

"ఫరవాలేదు. పొరపాటు మనిషికి సహజం" అని కదిపినాడు విహారి.

"మరేనండీ. మీరు అప్పటికీ ఇప్పటికీ ఒక్కమో స్తరుగా లేరు. ఏదో మార్పువల్ల గుర్తించ లేకపోయాను" అంది తార.

"మీలో మార్పువల్ల మీరసలు అవునా కాదా అని తటపటాయించాను" అన్నాడు.

అప్పటికీ హరిచరణుడి సంగతి ప్రసంగవశాన్నైనా అరుణతార ఎత్తుకోక ఏదో అంటీ అంటనట్టు ఉండడం విహారి గమనించి ఆశ్చర్యం కనపడనీయలేదు.

"నా అశ్రుతర్పణం పత్రికలో చూశారా?" అని అడిగినాడు.

"మరేనండీ పాపం! అంత దారుణంగా చనిపోయాడు హరిచరణ్"

"ఏం చేస్తాం చెప్పండి"

"మన చేతుల్లో ఏదీ లేదు. ఎంతో మంచివాడు సుమండీ" అంది ముక్తసరిగా.

"మీ రిద్దరూ స్నేహితులే గదా?"

"పాపం ఆయన త్యాగమూర్తి" అంటూ ఆమె చరణుడిమీది గౌరవం వెల్లడించింది.

" ఎందువల్ల త్యాగమూర్తి ! "

" మీకు తెలియదా ? ఆయన నాకోసం త్యాగం చేశారండీ " అంటూ కొంత దైన్యం కనబరిచింది. కంట తడి మాత్రం కనపడలేదు విహారికి.

" నాకు వేరే అవసరమయిన పనివుంది. క్షమించండి సెలవు " అంది.

అలా ముక్తసరిగా అరుణతార మాట్లాడి తప్పుకొంటూ వుంటే విహారి ఏమీ చెయ్యలేక " వెళ్ళి-వస్తాను " అంటూ వెళ్ళిపోయాడు.

తోవలో నడుస్తూ అనుకొన్నాడు : " ఇంగ్లీషు చదువుకుని శాస్త్రకూస్తో బళ్ళోనో కాలేజీలోనో అనుభవం సంపాయించి, తార ఇంత విపరీతంగా సంచరించిందేమిటని " అతని సందేహం. " ఇలాంటి ఆంగ్ల విద్యా పారంగత సామాన్యంగా చదువుకున్నవాణ్ణి మనసారా ప్రేమించి స్థిరంగా వుండమంటే ఎలా వుంటుంది ? సీతాకోక చిలకలా ముస్తాబై జనాకర్షణ చేస్తూ, విద్యా సంపద ఉందనే భ్రమతో, దురభిమానంతో అరుణతార హారిచరణుణ్ణి ఎలా ప్రేమిస్తుంది ? అయినా నా దగ్గిర తన సంగతి దాచుకొంటుందేం ? ఎన్నోసార్లు హారిచరణుడితో శరణాలయానికి వెళ్ళినా, నేను జ్ఞాపకం లేనట్లు వింతగా నటించింది. నటనాశక్తి అలవడిన నవనాగరక శిరోమణి పురుష హృదయంతో ఆటలాడింది. నమ్మించి కొంప తీసిందంటే వింత పడక్కర్లేదు. అలాంటిదాన్ని అమాయకుడు హృదయ సింహా

సనంమీాద ప్రతిష్ఠించి తన జీవితం అర్పించాడు. వైరివాడు చరణుడు! అసలు హరిబాబు తాల్ సోనాపూరులో చనిపోయూ డంటారు. వెళ్ళి భోగట్టాచేసి తీరాలి. చచ్చిపోయాడంటే నాకు నమ్మకంగా లేదు. నేనే కబురు పత్రికల్లో వేయించాను. యదార్థం నాకూ తెలియదు. అయ్యో! తల బద్దలై చచ్చి పోయాడట నా మిత్రుడు. నా ప్రియమిత్రుడు హరిచరణ్ అలాంటి ఘోరమరణం అమాయికుడు నవనీత హృదయుడు అనుభవిస్తాడా? అనుభవించడు!"

## ప ద మూ డు

సరిగ్గా అదే సమయంలో తాల్ సోనాపురంలో హరిచరణుడు కొంటెగా నవ్వుతూ వాళ్ళ పిన్నితో మాట్లాడుతున్నాడు. వసారాలో మాలీ కిశోరీ కాయస్థులు పొట్ట చెక్కలయ్యేలాగ నవ్వుతున్నారు.

పిన్నిగారన్నది "ఎంత చిత్రం చేశావురా చరణ్? ఏళ్లు పైబడ్డా కొంటెతనం మానలేదురా!"

"పిన్నీ! నేను చచ్చిపోయాక లోకం ఎలా అనుకొం టుందో నాకు అర్థమయింది. చచ్చి బతికాను."

"భాయీ! నీకోసం బెంగతో చచ్చి సగమయినాము. అబద్ధంగా ఇప్పుడు నువ్వు చనిపోయావు. నిజంగా నువ్వు చనిపోతే అప్పుడు మేము నమ్మలేం," అన్నాడు మాలీ.

"మీరంతా నాకోసం ఎలా విచారిస్తో ఉంటారో నాకు అర్థమయింది. నేను మీకు పనికిరానివాణ్ణి. అనవసరంగా మీరు విచారించారు" అన్నాడు హారిచరణుడు.

పిన్నిగారికి చరణుడిమీద కొంత ఆదరం కలిగినమాట వాస్తవము. స్త్రీల కోపం రత్నపు తళతళ వంటిది. అలాగే ఆమె కోపంకూడాను.

"అబ్బాయీ, ఇక్కడుండిపో. కలకత్తాపోయి ఎలా పాడైపోయావో! వొళ్ళు ఎలా చెడిపోయిందో గద" అని జాలిగా అంది.

"మీ వాడికేమీ ఫరవాలేదు. క్షేమంగా ఉన్నాం" అని మాలీ హామీ ఇచ్చాడు.

హారిచరణుడు బతికేవున్నట్లు వార్తాపత్రికలో అచ్చయింది. విహారి పొంగిపోతూ ఉత్తరం రాశాడు — మేఘాల మీద కలకత్తానుంచి సోనాపురం వస్తున్నానని. మాలీ మొదలయిన చిత్‌పూర్ మిత్రులు సోనాపురంనుంచి వెళ్ళిపోయారు.

హారిచరణుడి ఆరోగ్యం క్రమేణా చెడిపోతున్నది. ఆయాసం అధిక మవుతున్నది. నీరసంవల్ల కోపం ఎక్కువైంది. కోపం ఎక్కువయినకొద్దీ చిన్న మాటకూడా సహించలేక పోతున్నాడు. పిన్ని మొదట నాలుగయిదు రోజులు అతన్ని సరిగ్గానే చూచింది. పెట్టి పోషిస్తున్నది కనక అతన్ని ఒకటీ అరా మాటలు అనడం తప్పలేదు. దిలీపుడు వర్తకంలో

దెబ్బతిని నిరాశతో గాడీయు మఠంలో సాధువైనప్పణ్ణించీ అతని కుటుంబాన్ని ఆదుకొంటూ వచ్చింది.

సాయంకాలం హరిచరణుడికి ౧౦౨ డిగ్రీల జ్వరంవచ్చి మూలుగుతూ వుంటే "మాయదారి జ్వరం! తిన్నగా తిని తిరిగితే ఎందుకు వస్తాయి రోగాలు ?" అంటూ విసుక్కుంది.

పింతల్లి మాటలు విని "పిన్నీ ఇలావస్తావా ?" అని మంచంలో పడుకుని హరిచరణుడు ఆయాసంగా పిలిచాడు. పింతల్లి దగ్గిరికి చక్కా వచ్చింది.

"నీకు విసుగ్గావుంటే బండి చేయించి నన్ను కలకత్తా పంపించు. అక్కడ స్నేహితులున్నారు. ఆమాట అవిడకు కష్టంవేసి "చేయించుకోడం చేతనవును. పాపం మాట మాత్రం అనాయిస్తిరాదు. ఎప్పుడన్నా కొంచెం విసుగు రాదురా? అంతలోకే అలా అనుకుంటావు" అంది.

అతనికీ బంధుకోటికీ పడదు. మిత్రులు అతనికి దగ్గిర యినట్టు బంధువులు కారు. అవసరముంటే బంధువులు దగ్గిర చేరుతారు.

సాయంకాలం పిన్ని వైద్యుణ్ణి పిలిపించింది. ఆ పల్లెలో శ్యామచరణ చక్రవర్తి పాతకాలపు వైద్యం చేస్తాడు. కళ్ళ జోడు కనుబొమ్మల పైకి ఎగతోసి తీవ్రంగా ఆలోచిస్తూ నాడి పరీక్షించాడు.

"ఎలావుందండీ అబ్బాయికి ?" అని ఆదుర్దాగా అడిగింది; గుమ్మం లోపలతలుపు వోరవాకిలి వేసింది పిన్ని.

"నాడి మందంగావుంది. విశ్రాంతి తీసుకుని మందు మండలం రోజులు సేవించాలి. అప్పుడు నయమవుతుంది. ప్రస్తుతం జ్వరం కట్టడానికి మందిస్తాను" అంటూ చక్రవర్తి లేచాడు.

జ్వర తీవ్రతలో హారిచరణుడు పేలాపన మొదలు పెట్టినాడు. అపస్మారంవల్ల మనసు లోలోపల శమించిన భావాలు పైకి తోసుకు వస్తున్నాయి.

"ఎక్కడున్నాను? నేనెక్కడ ఉన్నాను? పిలిపించవోయ్ దాన్ని... హ్వా హ్వా వచ్చావా! తారా! అరుణతారా! వచ్చావా? నీకోసం అంతా సిద్ధంచేశానే. ఎప్పుడే ముహూర్తం? హ్వా హ్వా! అస్సట్టు, భద్రకాళీ! నీకెలా సమాధానం చెప్పను?"

మంచం దగ్గిరిగా కూర్చుని పింతల్లి "ఊరుకో నాయనా! మాట్లాడితే ఆయాసం ఎక్కువవుతుంది" అంటూ చన్నీళ్ళల్లో పట్టీ తడిపి కాలుతున్న అతని నుదుట వేసింది.

హారిచరణుడు "అమ్మయ్య! సుధాపానంచేసిన దేవతామూర్తిని! ఎంతహాయి! తాగినప్పుడు ఇంతహాయి అనుభవించాను! అదే నాఆపద్బాంధువు."

ఆ పేలాపన వినిగ్గి ఆమె ఇలా అంది. "దిక్కుమాలిన తాగుడు గుండెల్ని పీల్చి పిప్పిచేసింది. వొళ్ళు గుల్లయిపోయింది."

తెల్లవారిం తర్వాత విహారి వచ్చాడు. వచ్చి రావడంతో "పిన్నిగారూ! ఏడీ ఏడీ హారి?" అని ఆదుర్దాగా

మంచంమీద వున్న హరిచరణుణ్ణి చూచాడు. అతను పలకరిస్తే హరిబాబు పలకలేదు. తెల్లారింత రాత్రి జ్వరం జారింది. అతినీరసం వల్లా, వైశ్యసకోపం వల్లా వొళ్ళు తెలియక హరిచరణుడు మాగన్నుతో వున్నాడు. విహారిని చూచి ఎవర యిందీ పోల్చుకోలేక అతను ఊరుకొన్నాడు. జ్వరం క్రమేణా తగ్గుతున్నది కాని ఆయాసం తగ్గలేదు. త్వరగా పథ్యం పెట్ట వద్దని వైద్యరాజు ఖచ్చితంగా ఇంట్లో చెప్పినాడు. విహారి చరణుడికి కావలసిన ఉపచారాలు చేస్తున్నాడు.

"నీ ఋణం ఎలా తీర్చుకొంటాను విహారీ?" అన్నాడు చరణ్.

"ఇంత మాత్రానికేనా?"

"నాకు రెండు కోరికలున్నాయి. అవి బతికివుండగానే తీరుతాయా?" అని మెల్లిగా విహారిని అడిగాడు. కళ్ళల్లో తుల్లో కన్నీరు తూగాడింది.

"హరీ ఏం కావాలి?"

"అరుణతారను చూడాలనీ, భద్రకాళినికూడా చూడాలనీ, అనిపిస్తున్నది"

"హరిచరణా! నువ్వు చనిపోయావన్న కబురు అందచేస్తే నీ ప్రియురాలు ఏమందో తెలుసా?"

హరిచరణుడి ముఖంలో నవ్వు వెలుతురులా వ్యాపించింది. కొంత ఉత్కంఠ కనబరిచి తదేకదృష్టితో మిత్రుణ్ణి "ఏమంది? ఏమంది?" అని అడిగినాడు.

చెప్పేది నెమ్మదిగా విను, ఆందోళనపడి ఆయాస పడకు హరి పోయాడని అంటే, 'పాపం ఆయన మంచివాడు. నాకోసం త్యాగం చేశాడు' అంటూ పెదవుల చివర జాలి పలుకులు పలికింది.

“హరేకృష్ణ” అని చెప్పిన చరణుడి పెదవులమీద మ్లానహాసము ఉదయించింది, గుడ్డి వెన్నెలలాగ.

“ఆ ఆశ్రమంలో బాబ్డ్ జుట్టు పెంచింది. సీతాకోక చిలకలా వుంది. ఎత్తుజోళ్ళు వేసి తక్కుతూ తారుతూ ఐస్ పార్లోరులో ఉద్యోగంలో వుంది”

“అయ్యో! అరుణతార హృదయం మంచుగడ్డలాగా గడ్డ కట్టిందా? శ్రీహరీ” అని విచారంగా నిట్టూర్చినాడు హరిబాబు.

“చరణ్! ఆ వన్నెలదాన్ని మరిచిపో!”

క్షణంసేపు ఊరుకుని తేరుకుని హరిచరణుడు చెయ్యి మిత్రుని బుజాన వేస్తూ “విహారీ చూడవోయ్. భద్రకాళిని ఎరుగుదువా?” అని అడిగాడు.

“అంతా ఎరుగుదును. ఇప్పుడా వన్నెల విసనకర్ర మడికట్టుకొన్నదట?”

“అలా అనకు విహారీ” చరణుడు జాలిగా అన్నాడు.

“నీ స్త్రీపక్షపాతం ప్రమాదిస్తోంది సుమా! నిన్న మొన్నటిదాకా పహిలా పచ్చీస్ గా ఉన్న చిన్నది పతివ్రత అయిందంటావా అకస్మాత్తుగా?”

"అబ్బ... వాదవకోసం కాదోయ్... భద్రకాళికి నేను ఇక్కడే ఉన్నట్టు తెలియచేశాను. కబురందలేదు"

"దాన్ని ఇక్కడికి రమ్మనేనా?"

"అవునోయ్"

"పోనీ వస్తుందే అనుకో, వస్తే మీపిన్నిగారు ఎలా వూరుకొంటారు? అసలే పల్లెటూరు. వేశ్యను సంసార గృహంలోకి ఎలా అడుగు పెట్టనిస్తారు? రెండుమూడు రోజులు విశ్రాంతి తీసుకని కలకత్తా వద్దువుగాని."

"ఇక్ష్... ...నేను మళ్ళీ కలకత్తా రాగలనా? అయ్యో, నాకు భద్రకాళి కనపడదు" అంటూ కళ్ళు మూసినాడు. కన్నులకొసల కన్నీటిజడి జారైంది.

## పదునాలుగు

హారిచరణుడు జీవించే వున్నట్టు మాలీ కిశోరులవల్ల భద్రకాళి తెలుసుకుని యథార్థమా స్వప్నమా అని ఆశ్చర్యంలో మగ్న మైంది. అబద్ధపు మరణవార్త విని ఆమె అపరిమితంగా పరి తాపపడింది. అరుణతార అంతగా బాధపడలేదు. తన ప్రియుడు జీవించే ఉన్నాడని తెలిసినప్పటికీ భద్రకాళి బొటబొట కన్నీరు కార్చి నవ్వింది. దుఃఖం సంతోషం మేళనమై కలబలితమైంది. బాధలో వియోగ బాధానుభవంలో కాళి నిగ్గుతేరి, తప్తకాంచనం వలె వన్నె తేరింది, బాధలో హృదయము పదును తేలుతుంది. తంత్రులు బిగిస్తే కాని

దివ్యసంగీతం పొంగదు. సంఘం అల్పంగా చూచిన ప్రాణిలో ఎంత మానవత్వమూ ఎంత సహృదయతామా కారుణ్యమూ ఉన్నాయో!

ముసలితల్లి కాళి తీరూ తెన్నూ కనిపెట్టి "అమ్మాయీ మనసాని కులంలో తప్పబుట్టినావే. అతన్ని పెళ్ళాడితే నీ ధోరణి బాగు పడుతుంది. కులంవాళ్ళు మనల్ని తోసిరాజం టారు" అంది.

ఆ మాటలకు భద్రకాళి "అమ్మా! కులభేదాలు గంగలో కలిసిపోవాలి. నాహృదయం అదివరకే హరిచరణుడికి దత్తమై పోయింది. వివాహం అయిపోయినట్టే నమ్మా."

"ఏడిశావులేవే? ఆయన సంఘ భయంతో నిన్ను విడిచిపెడితే?"

"ఆయన నన్ను ఏలకపోయినా, నాదగ్గిర వుండడానికి ఆయన భయపడ్డా నేను ఆయన చరణదాసినే, ప్రియురాలినే. ఆయన దర్శనం ఇస్తే చాలు. ఆయన జీవించారనే సరికి పునర్జన్మ ఎత్తినట్లయింది. చనిపోయిన ప్రాణం అకస్మాత్తుగా లేచి వచ్చినట్టుంది."

"పోనీ శాల్ సోనాపురం వెళ్ళి చూసివస్తావా అతన్ని?" సందేహిస్తూ కూతుర్ని తల్లి అడిగింది.

"పల్లెటూళ్ళో బ్రాహ్మలింట్లో నేనడుగు పెడితే అక్కడున్నవాళ్ళు దుమ్మెత్తి పోస్తారమ్మా పెళ్ళాలనే వుంది, ఏంచెయ్యను? ఆయనకోసం తపిస్తున్నానే?" ఉద్రేకంలో కాళి అశ్రువులు కురిపించింది.

"ఆయనే వస్తారే పిల్లా! నువ్వు వెడితే బ్రాహ్మలు ఊరుకోరు. దానికీ అక్కడ గండగ పుట్టను," వృద్ధురాలన్నది.

"అవునమ్మా ఆయనను బాధపెట్టడం ఎందుకులే?"

"అమ్మాయీ! వడ్డీ సొమ్ముతో నెలవారీ ఖర్చు వెళ్ళేలాగ లేదు. ఎలాగ కాపరం గడవడం?"

"అమ్మా! నాగాజులు తెగనమ్మి సొమ్ము చేసుకుందాం. ఈ బస్తీలో మనం బతకలేం. పాటలగ్రామం పోదాం. చిన్న పల్లె. హాయిగా బతకవచ్చు."

"కాళీ! దరిద్రం ఎలా వరిస్తున్నావే? నీలాంటిది సానికొంపల్లో సామాన్యంగా ఉండదే. ఇంతకూ పెట్టి పుట్టాలి. నిక్షేపంగా తల దువ్వుకొని ముస్తాబై ఏ పెద్దమను షులనో కులాసాచేసి నాలుగురాళ్ళు సంపాయించక ఎందుకే పిచ్చిలో పడ్డావు?"

"అమ్మా! అలాంటి మాటలు మాట్లాడావంటే ఇంట్లోంచి నిన్ను తరిమేస్తాను. నేను అలంకారం నాప్రియుడి కోసం చేసుకుంటాను. ఆయన కోసం ఎదురు చూస్తూ వుంటాను. నాజీవితం ఇలా నిరీక్షణలో గడిచిపోయినా ఆనందమేనే"

"కాళీ! మాటలు కొత్తగా వస్తున్నాయి. అంతా బ్రాహ్మడి చలవ. ఆహాం" అంటూ తల్లి విస్తుపోయింది. కుమార్తెలో కలిగిన మార్పు ముసిలితల్లి ఊహించనయినా లేకపోతున్నది.

తల్లీ కూతుళ్ళు పాటల గ్రామంలో ఉండాలని నిశ్చ యించుకున్నారు. తను ఎక్కడున్నదీ తెలియక హారిచరణుడు

బాధ పడతాడేమోనని శాలీ ఉత్తరం రాదామనుకొంది. ఉత్తరంరాస్తె ఏమీా అనుకోడు గదా! అసలే పల్లెటూరు! ఎవరి చేతుల్లోనో పొరపాటున ఉత్తరం పడితే ఏమవుతుంది? అతనికి ఉత్తరం రాయాలని వేగిర పడుతోంది. హృదయంలో యుగయుగాల వియోగానంతర మాధుర్యము ఊటలూరు తోంది. హృదయం చిక్కబట్టడం కష్టమై భద్రకాళి లేఖ రాసింది :—

కలకత్తా, మే 8

"ప్రియ చరణా!

మీారు జీవించే నన్నిలా బాధపెడతారా? మీా వియో గం సహించలేక శరీరత్యాగం చేయడానికి సిద్ధమైనాను. మా అమ్మ నా ప్రయత్నం కనిపెట్టి అడ్డువచ్చింది. అమ్మయ్యో! మీారు పునర్జన్మ ఎత్తినట్లు నాకు తోస్తుంది. నేను రెక్కలు కట్టుకొని అక్కడ వాలాలని తపిస్తున్నాను. అక్కడి ఛాంద సులు, నన్ను బతకనీయరని హృదయారాటం కష్టంమీాద తగ్గించుకోవలసి వచ్చింది. మీాదర్శనం ఎప్పుడు? ఎప్పుడు? నేను జీవించి ఉండగా మీా దర్శనభాగ్యం చేకూరుతుందా? నా జీవనాడులు మీాకోసం స్పందిస్తున్నాయి. నా తుది నిశ్వాసం మీాకు వింజామర వేస్తుంది!

నేను జీవితంలో కోరేది ఒక్క మిమ్మల్నే! మళ్ళీ శరీరాలంకరణం ఆరంభిస్తున్నాను. నాచుట్టూ మీారే గాలి లాగ ఉన్నారని తలుచుకొని పులకరించిపోతున్నాను. మీాకు

ఇష్టమయిన చీర కట్టుకుని ఎదురు చూస్తున్నాను. పెట్టుకోడానికి నగలూ నాణ్యాలూ లేవు. అన్నీ తెగనమ్మి వేశాను. మీరే నాకు నగలు. బస్తీలో బతకలేక నా గాజులమ్మి ఆధనంతో పాటల్‌గ్రాము వెళ్ళిపోతున్నాను. మీరక్కడికి రారూ ? రారూ! నిరీక్షిస్తూ ఉంటాను.

మీ భద్రకాళి"

సరిగా ఉత్తరంరాసి ముగించిందో లేదో పక్క మేడ మీద రేడియో మీరాబాయి గీతం పాడుతున్నది.

"నిశదిన పంథ్ నిహారూం పివకో,
బార్ బార్ ఉర లాగీరీ"

ఆ పాటవిని భద్రకాళి "సరిగ్గా నాస్థితి అలాగేవుంది. పగళ్ళూ రాత్రిళ్ళూ మార్గం చూస్తూనే ఉన్నాను. నాహృదయం బాధపడుతూ వుంది. ఈ చీకటిరాత్రి విరహాగ్రిమ కళికలా వుంది! అబ్బ" అనుకొంది.

# పదిహేను

సన్యాలు బ్రాహ్మసమాజ పద్ధతిలో యథావిధిగా అరుణతారను కలకత్తా ప్రార్థన సమాజంలో వివాహం చేసుకొన్నాడని పత్రికా మూలంగా వెల్లడిఅయింది. చిన్నతనం నుంచీ తార తీరు ఎరిగిన సరళాదేవి సన్యాలు ఇంట్లోలేని సమయం చూసి వచ్చింది.

కాళ్ళకు పారాణి నెత్తిమీద మేలిముసుగు చూచి "ఏమమ్మా, తారా, పెళ్ళయిందని విన్నాను. నిన్నుచూసి పోదామని వచ్చాను," అన్నది.

"సరళా వచ్చావా?" అంటూ అరుణతార ముందుగా వెళ్ళి ఆమె రెండుచేతులూ పట్టుకొని ఆప్యాయంగా తీసుకొని వచ్చింది. ఐస్‌పార్లోర్‌లో తయారయిన ఐస్‌క్రీం, చల్లని పానీయమూ తెచ్చి ముందున్న బల్లమీద పెట్టి, ఎలక్ట్రిక్ ఫాన్ వేసింది. సరళాదేవి, క్రీం తిని మెల్లగా పానీయం తాగుతూ "ఎంత చల్లని దానివి తారా! అసలు తారలో తేజము ఉందంటారు. నువ్వు నిలువెల్లా చల్లని దానివి," నవ్వుతూ అంది. మాటల్లో వ్యంగ్యం తార గ్రహించలేదు.

"నీ పెళ్ళికి పిలవలేదేమి తారా? తెలిస్తే వచ్చేదాన్ని."

"చాలా హడావిడిగా జరిగింది క్షమించాలి."

"పూర్వస్నేహం కొందరు మరిచిపోతారు. అన్నట్టు మీ ఆయనకు ఈచల్లని పానీయాలు అమ్మడమేనా పని?" అని కొంత ఎటకారంగా, కొంత అన్నదాన్ని కప్పిపుచ్చి సరళ సౌమ్యంగా అంది.

"పూర్వస్నేహం మరిచిపోయావంటా వేమిటి సరళా?"

"చిన్నతనంనుంచీ నిన్ను ఎరుగుదును. నీకు కోపం రాకపోతే నామాటలు విను. గొప్ప కుటుంబంలో పుట్టిన దానివి, తల్లీ తండ్రీ పోయారు. ఆస్తి చితికిపోయినా కొంగున కట్టిన కస్తూరివలె ప్రతిష్ఠ మిగిలింది. ఆ కీర్తి గంగపాలు చేశావు!" అంది సరళ.

ఆ మాటలకు తారలో కోపో్ద్రేకం వచ్చింది.

"ఏం మాటలు సరళా ?"

"ప్రేమించినవాణ్ణి పెళ్ళాడక నమ్మించి ద్రోహం చేశావు తారా ?"

"ద్రోహం చెయ్యలేదు. మతి స్థిమితం లేనివాడు, త్రాగుబోతు హారిచరణుడు. అతన్ని ఎలా పెళ్ళాడను ?" అంది తార

"బాధలన్నీ విరగడ చేసుకుని అతను పోనే పోయాడు గదా !" జాలిగా అంది సరళ

"లేదు లేదు బాగానే ఉన్నాడని తరవాత తెలిసింది. ఎవరో కిట్టనివాళ్ళు లేని అబద్ధప్రచారం చేశారు"

"అతను జీవించివుండగా మరొకర్ని ఎలా పెళ్ళాడావు ?"

"కారణం చెప్పనే చెప్పాను"

"కారణం వెతికి చెబుతావు. నీమూలాన అతని ఆరోగ్యం పాడయింది. నిద్రాహారాలు లేక త్రాగుడు అలవాటయి జబ్బు పడ్డాడట. ఏమో రకరకాలుగా చెప్పుకున్నారు. బాధలు మరిచిపోయేందుకు త్రాగుడు అలవాటయిందట అతన్ని చూస్తే ఎవరికయినా ఏడుపు రాకమానదు. రోగ పడిలేచి తోచీ తోచక తాల్సోనాపురంలో చెరువుగట్టున పిట్టల్ని కొడుతూ తిరుగుతాడట. పగలు కాలవగట్టు చెరువు గట్టున తిరగడం, రాత్రి మనోవ్యాధి. నీమీద ఆశతో చచ్చి బతికాడట"

“ సరళా ఇదంతా నీకెలా తెలిసింది ? ”

“ మావారి స్నేహితుడు, విహారి చెబుతూవుంటే నా చెవుల పడింది. అలాంటి అమాయకుణ్ణి ద్రోహంచేశావు. నిజమేనా ? నేను అన్నందుకు కోపమా ? మీ వారు రాలేదు గద ? ” గుక్క తిప్పుకోకుండా ప్రశ్నలు పరంపరగా కురిపించింది సరళ.

అరుణతార సమాధానం చెప్పలేక తలవాల్చి నిశ్శబ్దంగా జలజల కన్నీరు కార్చింది. సరళా దేవి మాటలు శూలాలై ఆమెకు పశ్చాత్తాపము కలిగించాయి. మానవునికి ఇచ్ఛాస్వాతంత్ర్యము ఉన్నదిగదా అని ధర్మాధర్మ విచారణ లేకపోతే అధోగతి. సరళ ఆమె హృదయాగ్నిని రగులు కొల్పింది. రగులు కొలపడమే కాదు ప్రబోధ వాయువుతో జ్వలింప చేసింది. “ నిన్ను చాలా కష్టపెట్టాను. నువ్వు అతన్ని మరిచిపోతే నీకు దుఃఖము తప్పదు. తొందరపడి అతని జీవితం మంట కలుపుతున్నావు, మన స్త్రీజాతికి ఇది ధర్మంకాదు. వెళ్ళి అతని సమక్షంలో పశ్చాత్తాపంతో వేడి కన్నీరు కురిపించు. భగవంతుడు నీలో కారుణ్యం ఇంకేలాగ చెయ్యకపోతే కరుణాశ్రువులు, వేదనాశ్రువులు బాధానివారక బాష్పములు కురిపించు. అతను శాంతిస్తాడు. అదే నీకు క్షేమం ” అంటూ సరళ ఉద్రేక పూరితురాలయింది.

అరుణతార చీరకొంగుతో ముఖం దాచుకొన్నది. క్షణంఆగి ఈ పారాణితో ఈ మేలిముసుగుతో నేను ఏముఖం

పెట్టకొని అతన్ని చూడను? అతన్ని గాయపరిచి, అదిమానక పూర్వం దానిమీద కారం చల్లనా? ఎలా అతని ఎదట పడను సరళా?"

బ్రహ్మాండమయిన ప్రశ్న మనోనేత్రానికి గోచరమయింది. అరుణతార హృదయాగ్ని జ్వలించింది. సరళ వెళ్ళిపోయింది. మనస్తాపంవల్ల ఆమె పసిగా లేదు. అంతరంగ క్షోభవల్ల ఐస్ పార్లోర్‌లో కూర్చోడం మానేసింది. విలాసంగా తిరగడం, చక్కని చీరలూ జాకెట్లూ నగలూ మానేసింది. భార్య అనారోగ్య కారణం కనిపెట్టలేక పోతున్నాడు పన్నాలు.

# పదహారు

భద్రకాళి పాటల్‌గ్రామం వచ్చింది. కాలవకు కొద్దిదూరంలో రెల్లుతో కొంప కట్టుకుంది. తల్లికో గది, తనకో గది, భోజనశాల కేటాయింపుగా ఏర్పాటుచేసింది. చిన్న ఆవును ఇంటి దగ్గిరే ఖర్జూరపు చెట్టుకు కట్టేస్తుంది. గ్రామంలో అగ్రవర్ణాలు తిరకేసి చూడకపోయినా, ఊరిచివర గొల్లలూ రైతులు ఆమె పిలిస్తే పలుకుతారు. ఇంట్లో పనిపాటలకు గొల్లను కుదుర్చుకొన్నది. నిత్యం పచ్చని చేలూ కాలవగట్టూ, దూరాన కటీరాలూ, రాత్రి తారా మండితాకాశం వద్దన్నా ఆమెకు కనిపిస్తూ ఉంటాయి.

హరిచరణుడు పాటల్ల గ్రామం వస్తున్నాడని భద్ర కాళికి తెలిసింది. ఎప్పుడే వేళ వస్తాడో మాత్రం ఆమెకు స్పష్టంగా తెలియక పోవడంవల్ల, నిత్యమూ అతనికోసం ఎదురుచూస్తూ, వండుకొన్న అన్నం తినడం మరిచిపోయి కుటీర ద్వారందగ్గిర కూర్చుని ఆదుర్దాగా ఉంటున్నది. కొంత సేపు నింగీ నేలా కలిసిన దిక్చక్ర ఛాయను చూస్తూ కలలు కంటూ క్షణ మొక యుగంగా తలుస్తున్నది.

ఒకనాడు గొల్లవాడు అన్నాడు: "అమ్మగారూ! అయ్యగారు వస్తారనేనా మీరు గుమ్మందగ్గిర కూకుండారు? ముస్తాబు చేసుకోరా తల్లీ"

"వెర్రి గొల్లవాడికి ముస్తాబు చేసుకోడంకూడా తెలిసిందే" అనుకొని పైకి ఏమీ చెప్పక భద్రకాళి నల్లచీర కట్టుకొంది. నల్లరైక తొడిగింది. నీలాల కొప్పుపెట్టి, నీటుగా కాటుకపెట్టి, సాదా గాజులు తొడుక్కుని చీకట్లో కలిసి పోయింది. తమోభిసారికగా మారిపోయింది. ఎప్పుడు హరిచరణుడు వస్తాడో తెలియక కాలవదాకా పోయి ఆమె దీనంగా నీళ్ళకేసి చూస్తూ కూర్చుంది. కంటిమీదికి కునుకు వచ్చేదికాదు.

ఈరీతిగా వారంరోజులు రకరకాలుగా అలంకారం చేసుకొంటూ నిరీక్షణలో వాకాళి అవుతున్నది. ముసిలితల్లి కూతురి విరహం కనిపెడుతూ ఏమీ పాలుపోక తెల్లపోతున్నది. గొల్లవాడు ఇల్లు కనిపెడుతూ ఉన్నాడు.

ఒకరోజు అపరాహ్ణం వుంతదారినే రెండెడ్లుల మెళ్ళల్లో మువ్వల కిణకిణ వినవచ్చింది. ముందు గొల్లవాడు చోరవగా కాలవకట్టకేసి పరుగెత్తినాడు. కిలకిలా నవ్వుతూ, ఆనందాశ్రువులు జల్లుగా వెల్లివిరియగా వీడిన కేశపాశంతో, విడివడిన కుచ దుకూలముతో, వడివడిగా యమునాస్రవంతిలా పరిగెత్తింది భద్రకాళి.

బండివాడు హారిచరణుని మెడపట్టి, గొల్లవాడు నడుము పట్టి, బండిలోంచి దింపుతున్నారు. హారి ముఖాన తెలివి తేటలులేవు. గొల్లవాడు కాలవలో నీళ్ళుతెచ్చి హారిచరణుని ముఖాన చిలకరించాడు. భద్రకాళి ఉద్రేకపూరితురాలై మాట్లాడలేక హృదయం పిడికిట బిగపట్టింది. ఆమె ప్రియుణ్ణి చరణుణ్ణి లేవతీసి అతని శిరసు తన తొడమీద పెట్టుకొని కొంగుతో విసిరింది. నీరు గొంతులో పోసింది. అతనికి తెలివి వచ్చి కళ్ళుతెరిచి నీరసంగా "భద్రకాళీ! నాకింత పరిచర్య ఇంకెవరు చేస్తారు...నువ్వుతప్ప," అన్నాడు. కాళి కన్నులు చెమ్మగిల్లినై. ఏమీ మారుమాటాడలేక అతని శిరసు మూర్కొన్నది. నెమ్మదిగా హారిచరణుణ్ణి కుటీరం చేర్చారు.

"భద్రా! అమ్మయ్యా!... ...అలిసిపోయిన పక్షి... రెక్కలూడి...జీవయాత్రలో సొలసి... ...ఆహా...చల్లని నీడ...చేరుకుంది" అన్నాడు. కాళి సమాధానంగా అతని బుగ్గలు నిమిరింది. చెప్పలేకపోయింది. క్షణంసేపు మౌనంగా ఉన్నారిద్దరూ. అతని ఆయాసం కనిపెట్టి "ఇంత నీరసంగా

ఉన్నారు! గుండెజబ్బు కాదుగద!" అంటూ కాళి అతని శరీరం మృదువుగా స్పృశించింది. స్పర్శలో మాధుర్యంవల్ల అతనిశరీరం పులకలతో విరిసింది. అరమోడ్పు కన్నుగవ మధ్య కన్నీటి తెరమాటున అస్పష్టంగా ఆమెను చూస్తూ "నీ ఉత్తరం ప్రాణంగా దాచుకున్నాను భద్రా! నువ్వు నాకు ఎవరనీ ఇంత సేవ చేస్తావు భద్రా" అన్నాడు.

భద్రకాళి పెళ్ళికూతురిలాగ తల వాల్చి మాటలు రాని దానిలాగ లజ్జ చూపింది. ఆమె బుగ్గల్లో గులాబీలు విచ్చుకున్నై. నేత్రాల్లో రాగ రేఖ విరిసింది. కొంత సేపటికి ప్రయత్నంమీద అనగలిగింది:— "మీరే నాసమస్తం! ఇంతవరకూ మీకు తెలియనే లేదా?" ఆమె కంఠంలో గద్గదిక ప్రకటితమయింది.

హారిచరణుడు కుటీర ద్వారంవైపు దృష్టి పోనిచ్చి "నా ఇష్టంలేనిదే వన్నిలా కుటీరంలో ఎలా బంధించావు? అరుణతారను ఎంతో ప్రేమించాను. నన్నిలా ఎందుకు దాచు కున్నావు భద్రా! నన్ను ప్రేమించి ఏమిసుఖం నీకు? ప్రేమించి తారను ఏం సుఖపడుతున్నాను?" అన్నాడు.

ఆమె ముఖం చెరగుతో కప్పుకొన్నది. ఆమె నిశ్వాస స్పందనం అతను వినగలిగినాడు.

"ఓహో! మీఇద్దరిలో ఎంత భేదం వుంది! నమ్మించి ద్రోహంచేసి, పెళ్ళాడి, తీరా ఇప్పుడు పశ్చాత్తాపపడుతున్న తారకూ, కళంకం దుఃఖం అన్నీ భరించి, విపరీత సహన శక్తితో, త్యాగంతో ప్రేమించిన నీకూ ఎంత తేడా వుంది!"

అతని సహృదయం తెలుసుకుని కాళి సంతోషం పట్టలేకపోయింది. ఆమె మనసు వెన్నలాగ కరిగిపోయింది.

"చరణ్! ఈగాయం చూశారా? పూర్వంలాగ నన్ను చూచి అసహ్యించుకోరేం?" అని ప్రశ్నించింది కొంత సేపటికి.

"భద్రా! ఇప్పుడు నిన్ను ప్రేమిస్తున్నాను. ప్రేమకు రూపంతో నిమిత్తంలేదు. భద్రకాళి సమాధానం చెప్పలేక పోయింది."

"నేను పాపమే చేస్తున్నానో పుణ్యమే చేస్తున్నానో తెలియదు. నిన్ను ఈశ్వరుడు హింసిస్తే మరో జన్మలోనయినా మనం ఇద్దరం విడిపోకుండా ఉందాం," అన్నాడు.

కాళి హృదయం వెల్లువైంది. ఆమె అశ్రువులే ఆమె పలుకులైనాయి. ఆమెలో సాత్వికభావం శమించిన తరువాత "పునర్జన్మలోనైనా ఎప్పటికయినా పరమేశ్వరా ఈ దౌర్భాగ్యురాలి పాపం పరిహారం అయితే, మా స్నేహం కాపాడవా?" అంటూ నిశ్శబ్దంగా ప్రార్థించింది.

కొన్నాళ్ళు చరణుడు పాటల్రగామంలోనే వున్నాడు. ఎంత విశ్రాంతి తీసుకున్నా గుండెజబ్బు అతనికి తగ్గలేదు. ఒక్కసారి మిత్రులందర్నీ చూడాలనే తపన అతనిలో బయలు దేరింది. అతని ఇచ్ఛకు అడ్డురాకూడ దనుకొన్న భద్రకాళి ఇలా అంది:— "మీజబ్బు నయంకాలేదు. అక్కడక్కడా వుండి మంచూమాకూ లేక ఏమి ఇబ్బంది పడతారో, ఇక్కడే ఉండండి" దీనంగా వేడుకొన్నది.

హరిచరణుడు అనేక విధాల నచ్చచెప్పి కాళిదగ్గిర సెలవు తీసుకుని బండీ కట్టించుకుని బయలుదేరాడు. వుంతలో బండీతోపాటు కాళి నడిచింది. "భద్రా! వెళ్ళిపో నేను మళ్ళీ వస్తానుకదూ" అన్నాడు చరణుడు. అందెల మోతతో ఇంకా నడుస్తూనేవుంది కాళి. "నేను జీవించిఉండగా మీదర్శన భాగ్యం ఇప్పించండి" అంటూ వెనక్కుపోయి మళ్ళీ వుంతదారినే వస్తున్నది. "భద్రా! నీ అందెల కిణకిణ క్వాణం నాచెవుల్లో రింగుమంటోంది, నేను తప్పకుండా వస్తాను మళ్ళీ! వెళ్ళిపో! ముళ్ళూరాళ్ళూ! నీపాదాలు గాయమైపోతాయి" అన్నాడు. "చరణా! రాళ్ళుముళ్ళూ నాకు లెఖలో లేదు. నీదరి చేరుతున్నప్పుడు పాదాలు రక్తసిక్తాలయినా బాధలేదు. ప్రియచరణా! మీరు రాకపోతే మీకోసం ఎదురుచూస్తూ ప్రాణాలు విడుస్తాను."

చరణుడు అన్నాడు "వస్తాను భద్రా!"

"మీరు కష్టాల్లో ఉంటే కాకిచేత కబురంపితే మీదగ్గిరికి వచ్చి వాలుతాను" అంటూ భద్రకాళి నిలవబడిపోయింది వుంతలో. ఆమె కన్నులవెంట కన్నీ రోడుతున్నది. బండీ కంటికి కనపడడంలేదు. ఎద్దులమెడల్లో గంటలు సన్నసన్నగా వినపడుతున్నాయి! బరువయిన హృదయంతో భారంగా అడుగువేస్తూ ఆమె కుటీరానికి నడచింది.

# పదిహేడు

అరుణతార లివరు జబ్బుమూలాన కృశిస్తోంది. దానికితోడు మనోవ్యాధి ప్రబలమయింది. చక్కదనమంతా తీసిపోయి బోసిపోయి మనిషికి క్రమేణా నల్లరూపు వచ్చింది. ఎముకలు బయట పడ్డాయి. కళ్ళు లోతుకు పక్కు పోయినై. శరీరమంతా పొడలు బతులు దేరాయి. సన్యాలు పానీయం అమ్మడం తగ్గించి అస్తమానం భార్య దగ్గరే వుంటూ ముక్కారు ముద్దినుసు వస్తువులూ కొని తెస్తున్నాడు. ఏంచేసినా ఆమెకు ఉల్లాసం లేదు. ఇంగ్లీషు వైద్యం చేయిస్తున్నాడు. ఎన్నాళ్ళు మందూమాకూ ఇప్పించినా డాక్టరుబిల్లు పాపంపెరిగినట్టు పెరుగుతోంది. అరుణతార గర్భమంతా కాలేయమూ ప్లీహమూ వ్యాపించాయి. ఆమె కళ్ళల్లో వింతగా మెరుపు జయులు దేరింది.

తన పక్కనే కూర్చున్నప్పుడు భర్తతో ఏదో సంగతి చెప్పేద్దామని ఆమె నాలుక చివరదాకా వస్తోంది. అయితే ఆమె చెప్పలేక లోలోపల ఇముడ్చుకొంది. సన్యాల్ కొన్నాళ్ళకు అది కనిపెట్టి “తారా నీకేమయినా కావాలా? మందు మార్చి మరోచోటు తీసుకు వెళ్ళమన్నావా?” అని అడిగాడు.

చెమ్మగిల్లిన కళ్ళతో "నేను ఎలాగా జీవించను హృదయంలో దాచుకొన్నకొద్దీ బాధగావుంది. చెబితే మీకు కష్టం కలిగించినదాన్ని అవుతాను" అంది తార.

ఆ మాటకు అ వి ముఖకాంతి తరిగింది. అతను సంబాళించుకొని "చెప్పు తారా! నీకోరిక ఎలావుంటే అలాగే కానీ" అన్నాడు.

"నేను జీవితంలో మహాపాపం చేశాను. ఆ పాపానికి పరిహారం లేదు. ముమ్మాటికీ ఉండదు. ఇప్పుడే అనుభవిస్తున్నాను. పాపఫలం! హరిచరణుడి జీవితం చేతులారా నేనే పాడుచేశాను, మీమీది వ్యామోహంవల్ల. అతన్ని బికారిని చేశాను. నావల్ల మీకూ సుఖంలేదు. మందూమాకూ ఇప్పించి నన్ను బాధించక వేగిరం చనిపోనీయండి. చనిపోయే ముందు నాకోరిక మీరు చెల్లిస్తే నాఆత్మ శాంతిస్తుంది. అలా చేస్తానని నా చేతులో చెయ్యి వెయ్యండి" అంటూ అరుణతార చేయిచాచింది.

రోగి మానసిక స్థితి గ్రహించి ప్రేమ చెయ్యడానికయినా సన్యాలు సిద్ధపడి ఆమె చేతిలో చెయ్యివేసి "నీకోరిక ఏమిటో చెబు తారా!" అన్నాడు.

"ఒక్కసారి హరిచరణుడికి కబురు చెయ్యండి. నేను చనిపోయేముందు అతను క్షమాపూర్వక కారుణ్యంతో నన్నుచూస్తే హాయిగా చనిపోతాను. అబ్బ! ఆయాసంగా వుంది... ...ఆయనకు తంతీఇవ్వండి..." హృదయభారంతో

అంది. ఆమె తలకొట్టు నిమురుతూ శయ్యాపక్కనే సన్యాలు కూర్చొని మొదటిసారి అతని జీవితంలో మర్మాంతిక వేదన అనుభవించాడు. ఆ వేదన జ్వాలవలె హృదయగోళమంతా ఆవరించి అతన్ని వేగించింది. సన్యాలు పెద్దవాడయిన తరువాత ఎప్పుడూ ఇలా కన్నీరు కురిపించి ఎరగడు. తనకు తెలియని కరుణా హృదయాంతరాళంలో ఊటలూరి ద్వేష భావాన్ని కరిగి వేసింది. "పాపం అతనికి తంతీఇస్తాను" అని అన గలిగినాడు.

"నన్ను ఇక్కడే వుంచే మాటయితే ఇక్కడికే ఆయనను రమ్మనండి" అంది తార.

"ఇక్కడ ఈ వైద్యం కుదరదు. నిన్ను ఆసుపత్రిలో చేర్పిస్తే వైద్యసహాయం బాగుంటుంది. నర్సులు అస్తమానం నిన్ను కనిపెడతారు. ఏమంటావు?" అన్నాడు సన్యాలు.

"ఇల్లువదలి ఆసుపత్రిలో చనిపోవడం ఎందుకు?"

"అలా అనకు, నీజబ్బు నయమవుతుంది తారా!"

కళ్ళమ్మట నీళ్ళుపెట్టుని "నాపాప పరిహారం మృత్యువే. బతికి ఏం సుఖం" అంది తార.

సన్యాలు "ఎందుకలా మనస్సు కష్టపెట్టుకొంటావు. లోకంలో పాపం చెయ్యని వాడెవడు? అందుకోసం చనిపోవడం మంచిదనుకొంటె ఎలాగ చెప్పు. తారా! నిన్ను క్షమించే భార్యగా చేసుకున్నాను." అని పలికినాడు.

"మొదట్లోనే వివేకం ఉండదుగదా మనిషికి" దీనంగా అంది.

"పని చేసేముందు వివేకమంటూ వుంటే మంచిదే. ఇంతకూ మనసు తప్పుకుని ఎందుకలా కుమిలిపోతావు పుట్టెడు రోగంతో ఉన్నావు. చిత్తక్షోభ పడకు తారా! విశ్రాంతిగా ఉండు. ఏమీ ఆలోచించకు"

"నాజన్మకు విశ్రాంతి ఒక్కచోటనే" అంది విసుగ్గా.

"నామాట విను. ఆసుపత్రిలో నిన్ను చేరిపిస్తాను" అన్నాడు సన్యాసి.

## ప ద్దె ని మి ది

పాటల్గ్రామంనుంచి హరిచరణుడు వెళ్ళిపోయి మిత్రకోటిని కలిసి రోగం మరచిపోయాడు. సహవాస దోషంవల్ల విశ్వంభరుడి మూలాన చరణుడు సురాపానం ఆరంభించాడు. అతను స్నేహితుండిగదిలో తాగి దొర్లుతూ "ఛీ! నేను ఎవ్వరినీ ప్రేమించను, ప్రేమనాటకం బూటకం ఓ తారా! నిన్ను మరచిపోతాను. హ్హా హ్హా మరిచిపోతాను. కాళీ! నాహృదయం దొంగిలించావే? ఎంత నేర్పరివి! ప్రేమ మహా వంచన అని ఎరగవుటే? హ్హా హ్హా" నవ్వుతూ పేలాపన సాగించాడు. తాగుడువల్ల అతని గుండె నీరసం ఎక్కువయింది. కడుపు పీపాలాగ తయారయింది. తిండికూడా అతను మానేసి తాగుడు మీదనే ఆధారపడి బ్రతుకు పాడుచేసు కొంటున్నాడు.

విహారి డాక్టరు సలహామీద చరణ్ణి తీసుకుని ప్రయాగ వెళ్ళినాడు. గాలి మార్పువల్ల రోగం కొంత మళ్ళింది! అల

వాటు నిగ్రహించేసరికి సుర దొరక్క చరణుడు గిలగిల్లాడి నాడు. ప్రయాణంలో ఆడదిక్కు కూడా ఉంటే మంచిదని విహారికి తోచింది. తనభార్య గర్భిణి కావడంవల్ల విహారి ఆమెను పుట్టింటికి పంపించేశాడు. అందువల్ల ఆడదత్తు లేదు. ప్రయాగలో హోటలునుంచి హారిచరణుడికి భోజనం తెప్పించేవాడు. ఎప్పుడయినా కొంచెం నరాలు నములుతున్న బాధగావుంటే చరణుడు ఇలా అనడం మొదలు పెట్టాడు. “విహారీ! పాపం భద్రకాళిని పిలిస్తే ఎలా వుంటుంది? పాపం దానికి మాట ఇచ్చాను. నాబాధలో సేవాభాగ్యం కోరింది ఆ దీనురాలు”

విహారి అందుకు అంగీకరించలేదు. కొంతసేపటికి చరణుడికే తోచింది కాళీకూడా ఉండగా ఊరూరా తిరగడం బాగుండదని. అతని హృదయంలో కాళిమీద ప్రేముడున్నా పూర్ణగౌరవం ఇవ్వలేక పోయినాడు. భద్రకాళికి తెలిస్తే కొంత నొచ్చుకోకపోదు. బలవంతాన కట్టిపెట్టడంవల్ల అతని చిత్తంలో భద్రకాళి తారాడుతునే వుంది. మిత్రులిద్దరూ నెలరోజులు సంచారంచేసి కలకత్తా వచ్చారు.

చరణుడు కలకత్తా వచ్చినప్పటినుంచీ మనసు అరుణ తారమీదికి పోతున్నది. మనోనిగ్రహం పోయింది. “నేను జీవించిఉండగా ఒక్కసారి అరుణతారను చూడాలి! ఎవరేమనుకొన్నా సరే” అని చరణుడు నిశ్చయం చేసుకున్నాడు. సన్యాలు ఇచ్చిన తంతివల్ల తారను చూడక తప్పదని

మనసులో అనుకున్నాడు. విహారికిగాని విశ్వంభరుడికిగాని చెప్పకుండా జోడెద్దులబండీ కట్టించుకుని హరిచరణుడు అశ్వత్థపురం బయలుదేరాలనుకొన్నాడు. అరుణతార కలకత్తాలో ఉండడానికి ఇష్టంలేక అన్నగారింటికి అశ్వత్థపురం వెళ్ళింది రోగం రొప్పితో. సన్యాలు కూడానే ఉన్నాడు.

రాత్రి వర్షంకురిసి వెలిసింది. రాత్రి గడియలు లెక్క పెడుతూ ఆయాసంతో మూలుగుతూ హరిచరణుడు ఎప్పుడు తెల్లవారుతుందా ఎప్పుడు అశ్వత్థపురం వెడతానా అని తాపత్రయంతో ఉన్నాడు. కలకత్తాలో రైలెక్కి సమీపంలో ఉన్న చిన్న స్టేషనులోదిగి బండీ మాట్లాడుకొన్నాడు. అతను బండివాణ్ణి అడిగాడు: "ఎన్నాళ్ళు పడుతుందోయ్ ప్రయాణం?"

"అయ్యా రోజల్లా పడుతుంది బాబయ్యా, దారి బాగులేకపోతే రెండురోజులు కూడా అవుతుందయ్యా"

"రెండురోజులు నేను బతికి అరుణతారను చూస్తానా? ఎలాగయినా ఆఖరిసారి ఆమెను చూడాలి"

అతను బండీ ఎక్కుతూవుంటే చచ్చిపోయిన తల్లీ, సాధువుల్లో కలిసిన తండ్రీ, మహాత్యాగంచేసి క్షేమించిన భద్రకాళీ అతనికి జ్ఞాపకం వచ్చారు. కన్నులు గ్రుచ్చిన నిండి పోయినై. పశ్చాత్తాపడి జీవవన సంధ్యలోఉన్న అరుణతారను చూస్తేగాని అతని హృదయానికి శాంతి లేదు.

తోవ తిన్నగా లేదు. వానసీరు నిలిచింది అక్కడక్కడా గుంటల్లో. రస్తా బాడీ బందగా వుంది. బురదలో బండిచక్రాలు

కూరుకుపోతున్నాయి. తరుచుగా బండివాడు దిగి పూనికతో చక్రాన్ని పట్టవలసి వస్తున్నది. ఎద్దుల వీపులమీద వాతలు తేలుతున్నాయి. నిర్దాక్షిణ్యంగా కొడితేగాని ఎద్దులు బండీ లాగలేక పోతున్నాయి. పదికోసుల దూరం ఎప్పటికి చేరడం. ఉదయం చలిగాలి హోరున వీస్తున్నది. ఉదయం మధ్యాహ్నం గడిచాయి. సాయంకాలమైంది. గాలి సోకడంవల్ల బండి కుదుపుకు హరిచరణుడికి జ్వరంకాసింది. ఆయాసంతో బాధగా హరిచరణుడు మూలుగుతూ "ఎంతదూరం పోవాలోయ్ మనము ?" అని అడిగాడు. అతనికి ఉత్సాహం కలిగించాలని బండివాడు "ఎంతో దూరంలేదు బాబయ్యా" అని జవాబిచ్చాడు. మరి కొంతసేపటికి అడిగింది మరిచిపోయి చరణుడు అదే ప్రశ్న వేశాడు. బండివాడు "ఆరు కోసులున్నది" అన్నాడు.

"బండి అబ్బాయీ ! నాయనా ! నన్ను త్వరగా అశ్వత్థపురం చేర్చవోయి ! నాగడువు దగ్గిరికి వస్తున్నది. నీకు ఎంతయినా సొమ్ము దఖలు చేసుకుంటాను." అని హరిబాబు కడుపు తరుక్కుపోయేలాగ దైన్యంగా అడిగాడు. "చిత్తం బాబా" అంటూ ఉత్సాహంగా బండి తోలుతున్నాడు. హరిచరణుడికి ఒకటే మనోబాధ "అశ్వత్థపురం చేరగలనా ? లేనో ? చనిపోవడానికి సిద్ధంగాఉన్న అరుణతారను చూచి ప్రాణాలు నెమ్మదిగా విడవగలనా ?"

జ్వరంమూలాన రాత్రిల్లా బండిలో అతను లంఖణం, హోరుమని గాలి. బండిఎద్దుల మువ్వల గణగణ. పొలాల్లో

కీచురాళ్ళ రొద. ఈ ధ్వనులు అతనికి వినపడుతున్నాయి. అతని మనసంతా అశ్వత్థపురంలోనే వుండడంవల్ల ప్రయాణం చేస్తున్న ధ్యాస పోయింది క్రమంగా. రాత్రల్లా మూలిగి హరి కొంతసేపు మాగన్నుతో ఉన్నాడు. ఏదో మైకం ఏదో స్వప్నం తెల్లారేసరికి కళ్ళువిచ్చాయి, మళ్ళీ ప్రపంచం తెల్లగా విచ్చింది. ప్రయాణం చేస్తున్నట్టు తెలుసుకున్నాడు. సుషుప్తిలో బాధలు లీనమయినాయి. జాగృతిలోకి అతను వచ్చేసరికి యాతన సిద్ధం. బండివాడు బండీ ఆపి ఎద్దులకు మేతపెట్టి తను చలిది తిన్నాడు. తెల్లవారే సరికి హరిబాబుకు జ్వరం తగ్గింది. అతను కాఫీ తాగాలనుకున్నాడు. ఎక్కడ దొరుకుతుంది! బండివాడు యథా ప్రకారంగా తోలుతున్నాడు. తోవపక్కనే పచ్చని వరిచేలు పంటకాలువలు. హరిబాబు వాటిని చూడడంలేదు.

"ఏమోయ్ ఎప్పటికి చేరగలం?"

"బాబూ సంజవేళకు చేరగలం"

"హరిచరణుడు కఠినంగా ఎగుడు దిగుడుగా ఉన్న డొంకకేసి చూస్తూ వేడినిట్టూర్పు విడుస్తూ "పరమేశ్వరా! దయాసింధూ" అన్నాడు.

బండివాడు అతనిస్థితి అర్థం చేసుకోలేక "ఏంబా బయ్యా" అని అడిగాడు. ఆయాసంవల్ల ఎక్కువ మాట్లాడ లేక పోయాడు చరణుడు

"అయ్యా పండుకొన్నారా?" బండివాడు అడిగాడు. మాట ఏమీ లేదు. చరణుడికేసి లోపలికి చూశాడు బండి వాడు. హరిచరణుడి పెదవులు కదిలినై. బండి ఆపి బండివాడు హరిబాబును గడ్డిమీద బండిలో పడుకోపెట్టి దుప్పటి కప్పి

నాడు. మాట సమాధానం చెప్పలేక హారిచరణుడు కృతజ్ఞతా పూర్వకంగా రెండు కన్నీటి చుక్కలు జార్చినాడు. సూర్యకిరణాలు బండి గూడులోంచి అతని ముఖాన ప్రసరిస్తున్నా యి బుగ్గలమీద కన్నీరు మెరసింది మిలమిలా.

సూర్యాస్తమయం అయింది. బండి అశ్వత్థపురం చేరింది. హారిబాబు బండి దిగలేక పోయినాడు. బండివాడు ప్రాణికతో అతన్ని ఎత్తుకుని చెరువుగట్టున రావిచెట్టుపక్కనే అరుగుమీద దింపినాడు. చీకటి కాటుకలా నల్లగా వ్యాపిస్తోంది. నీరూ నేలా కూడా తెలియడంలేదు. బండివాడు దీపం వెలిగించి అరుగుమీద ఉంచాడు. చరణుడిచ్చిన డబ్బు లెఖ చూచుకొంటున్నాడు. రావిచెట్టుదగ్గిర దీపకాంతి చూసి పాలు పిదికి ఇంటికి తీసుకుపోతున్న గొల్లవాడు వచ్చి చరణుణ్ణి చూచాడు.

"ఎవరికోసం బాబయ్యా తమరు దయచేశారు!" గొల్ల అడిగాడు.

హారిబాబు చెప్పలేకపోయాడు అతని నోరు పక్షవాతం అకస్మాత్తుగా రావడంవల్ల పడిపోయింది. బలవంతాన చేయెత్తి ఏదో సైగచేశాడు. బండివాడు కొంతవరకు తోవలో అతని స్థితిని గురించి వాడికి చెప్పాడు. వాడికి ఏమీ పాలుపోక కరణం గారితో మనవి చేశాడు. ముగ్గురు దీపాలు పుచ్చుకొని వస్తున్నారు చరణుడు ఎవరో వాళ్ళకేం తెలుస్తుంది? ఎవరికోసం అన్నారు వచ్చాడో? హారిబాబు జవాబు చెప్పలేక కంటతడి పెట్టాడు. అతని హృదయంలో జరుగుతున్న మథన కన్నీటిలో ప్రతిఫలించింది. మాటలులేని మూనబాధ అతను పడుతున్నాడు.

అరుణతార అన్నగారింట్లో తెలిసింది ఎవరో బండి కట్టుకుని అశ్వత్థపురం వచ్చినట్టు తారకు అర్థమయింది. తంతీ ఇవ్వడం వల్ల హారిచరణుడే వచ్చి వుంటాడని ఆమె వెంటనే నిశ్చయానికి వచ్చి, నీరసంగావున్నా లేచి గుమ్మంలోకి వెడుతున్నది.

“ పడిపోతావు వెళ్ళలేవు ఎక్కడికి ? ” ఆదుర్దాగా సన్యాలు ప్రశ్నించాడు.

“మనింటికి ఎవరో వచ్చారు. చరణుడేమో, తంతీ ఇచ్చాం.”

“ ఇంటికిరాక ఎక్కడో ఎందుకు ఆగిపోతాడు. ” అన్నాడు సన్యాలు.

“ అమ్మాయీ లేస్తే పడిపోతావే. పడుకో ” అన్నాడు తార అన్నగారు.

“ ఆమె హృదయంలో అనూహ్యమయిన ఆందోళన బయలుదేరింది. ఎవరిమాటా లక్ష్యం చెయ్యక బయలుదేరింది. చలిగాలి రివ్వున వీస్తున్నది. తోవన వెడుతున్న కరణంగార్ని పిలిచింది “ ఎవరో వచ్చారట మనవూరు ? ఎవరండీ ? ” ఆదుర్దాగా అడిగింది.

కరణంగారు దీపం కిందపెట్టలేదు. నడుస్తూనే జవాబు చెప్పాడు : “ ఏమో ఎవరికోసమో ఒకాయన వచ్చాడు. రావిచెట్టు దగ్గిర అరుగుమీద పండుకొన్నాడు. నడవలేడు. బండివాణ్ణి అడిగితే ఎవరో బస్తీమనిషీ, రోగంతో వున్నాడనీ చెప్పాడు. ”

“ మాటలేదా ? ” నడుస్తు అరుణతార ఉద్రేకంగా అడిగింది.

"పక్షవాతం వచ్చి నోరు పడిపోయినట్టుంది" అన్నాడు కరణం.

"వైద్య సహాయమన్నా... ...ఏమండోయ్... ... నామాట వినబడదు.

అన్నయ్యా! ఎవరో చూచిరా అన్నయ్యా! చెరువు గట్టున పడిఉన్నట్టు." అయ్యో నాకాళ్ళు దడదడలాడుతున్నాయి. నడవలేను," ఆవేదన వెళ్ళకక్కింది అరుణతార. తార అన్నగారు వినిపించుకోలేదు. సన్యాలు విసుక్కొంటూ "వెళ్ళి పడుకో నేను కనుక్కొంటాను. మనకోసం వచ్చే వాళ్ళు చెరువుదగ్గిర దిగి ఊరుకుంటారా? వాకాబు చెయ్యరూ, వెర్రికాకపోతే" అంటూ చెరువు దగ్గిరికి వెళ్ళినాడు. బండివాడు డగ్గుత్తికతో "బాబయ్యా! వోరోనండీ బస్తీ అయ్యగోరు... ...నోరు పడిపోయింది అయ్యకు. ఈడకు రావాలని శెడ్డ గింజుకుండారు."

సన్యాలు హారిచరణుడిమీద కప్పబడిన దుప్పటీ తొలిగించాడు, దీపం వెలుతురులో. చరణుడి నోరు వంకరపోయింది. కళ్ళు మూతపడ్డాయి. అతని బుగ్గమీద కన్నీటిచారలు అలాగే ఉన్నాయి. అతనిగుండెలు చేత్తో స్పర్శ చేశాడు సన్యాలు. భార్యతో చెబితే ఆవిడ గుండెలు ఆగి పోతాయని అతను భయపడుతూ రాయిలాగ అక్కడే నిలవబడ్డాడు.

ఎంతసేపటికీ భర్త రాకపోవడం వల్ల అరుణతార రోగబలంతో తోసుకుని వచ్చింది. సన్యాలు భార్య ముఖం చూడలేక పక్కకు తిరిగినాడు. అరుణతార "విశ్వాస ఘాతకివి" అంటూ చరణుడి శవంమీద పడిపోయింది హోరుగాలి వీచింది.

---